# సేవాంజలి





సారస్వత సేవాసమితి ఘనపురం స్టేషన్

పార్థివ ఉగాది.

సారస్వత సేవా సమితి ప్రథమ ప్రచురణము.

* ఒక మహాత్ముని తాదాత్మ్యంతో మీరు జీవిత రంగంలో ప్రవేశించి స్త్రీపురుషుల సమవిభాగంతో, ఏదౌర్బల్యముగూడ చేరనేరదు.

—మహాత్మాగాంధిగారు.



" దేనిని చూచి ప్రపంచం దుఃఖమని అంటుందో, అదే కవికి సుఖప్రదమైంది. అధికారము, ధనము, కీర్తి, ఈ గొప్పతనాలు ప్రపంచాన్ని ఎంతవిమోహపెట్టిన కవికి ఏమాత్రంగూడ వీనిలో ఆకర్షణ లేదు. కవియొక్క ఆనందము కేవలం ఆర్తుల హృదయబాధ కనుక్కోవడంలో, మూగవాళ్ళ పలుకు ఆలకించడంలో, దుఃఖితుల కన్నీరు తుడవడంలోవుంది. ఏరోజైతే కవికి బాధితజగత్తుపై ప్రేమ లేక పోతుందో ఆరోజు ఆతను కవి పదవినుండి తొలగిపోతాడు.

—ప్రేంచందు,

# ఉగాది

అర్ధరాత్రి. తెనుగు దేవాలయాల గర్భగుళ్ళోనుండి "గణ-గణ" ఘంటారావము విని దిగ్గున మేల్కొన్నాను. ప్రతి నిత్యం తెల్లవారు ఝామున మ్రోగే గంట యీరోజు అర్ధ రాత్రిపూట మ్రోగుటకు కారణమేమిటా? అని ఆశ్చర్య పోయాను. పూజారి సైన విద్యుక్త ధర్మాన్ని ఈ అర్ధరాత్రి యే నెఱవేర్చుకొనుటకుగల కతమేమి? ఈ రోజు విశేషతత్వ మహాత్మ్యమేమైనావుందా? అని సింహావలోకనం చేసుకోగా.......

—"పూజారి" "తారణ" కు వీడుకోలు చెప్పి "పార్థివ" ను ఆహ్వానిస్తున్నాడని తెలిసికొని త్వరగా లేచి కాలకృత్యములు తీర్చు కొని, భాగీరథిలో స్నానమొనర్చి, శుభ్రమైన ధవళ వసనముల ధరించి, సంధ్యానుష్ఠాన కర్మల నాచరించి "సేవాంజలి" హస్త ములదాల్చి సరస్వతీ దేవి పావన చరణములందు సమర్పించినాను.

అప్పుడే ప్రాభాతమగుచున్నది. సూర్య భగవానుడు కుంకుమ పూతల నలంకృతుడై తన లేతకిరణముల నీవిశాల భూమిపై ప్రసరింపజేస్తూ మురిసిపోతున్నాడు.

పార్థివ ఉగాది ప్రపంచంలో అడుగుపెట్టింది.

—సాహిత్యారాధకుడు.

* *
*

# అంకితము

అన్యుల నాదరించి యిపుడార్తతనొందిన యాంధ్రమాత, చై
తన్యవిహీనమైన సుతుల దాస్యముజూచు విషాదమూర్తి, మా
దైన్యము బాపవేడుదుము తల్లికి తల్లివి నీవె దిక్కు, నీ
స్తన్యము గ్రోలుచున్ కృతి నొసంగితి విన్నరో! స్వీకరింపవే

—మనుముల...'మూర్తి'

చదువులమ్మ, సరస్వతి, శారదాంబ.
సేవాసౌభాగ్యమున్ యపేక్షించినాము.
ప్రీతి 'సేవాంజలి' ని సమర్పించినాము.
మాతృకంఠాన యిదిపూల మాలయగుత.

—పొడ్యాల...'గిరి'

తీయని భాషయౌ తెలుగు దీప్తరుచుల్ మనుగోల జేయు, ము
గ్ధాయత మానసంబునను గానముసేసి, భజించి, సేవలన్
సేయగ నిచ్చగించ జననీ ఇదె చంద్రికకొక్క పోగుగా.
నీయుదు మిద్ది గైకొనుము నీ కొమరుల్ ముదమంద భారతీ!

—అద్దూరి...'రామం'

భావతరంగ ఘటలలకు
జీవంబౌ జలధియనెడి శ్రీభారతికిన్
సేవించి యాంజలించెద
'సేవాంజలి' ప్రేమతోడ స్వీకృతియగుతన్.

—సముద్రాల...'లక్ష్మణ'

# — విషయసూచిక —

స్వస్తి వచనము.





# *మాతృగీతము

జయజయ హే! మహాంధ్రజననీ-మధునాదవనీ.

జయజయ హరిదంతవినత- మస్తకాగ్ర తరుణాఘృః!-

శ్రీగిరివేణీ కృష్ణా-గౌతమి సుమణీ

భద్రాద్రిమేఖలరత్నా-పారిజాతసుమణిరత్నా!...జయ..

రాణ్మహేంద్ర కోశధనా-రాజితహంపీసూనా

ఆంధ్రనగరహర్మ్యవిభా-అమృతకణాంతరశోభా...జయ....

ఆంధ్రవిష్ణుని యమతటీ-అచ్చుతరాజ నరేంద్రక్షితీ

కృష్ణరాయరసధాత్రీ-కాకతిరుద్రోత్సవజనయిత్రీ!..జయ..

నన్నపార్యసుందర శివవదనా-స్నాతగోస్తనీ పోతనసదనా

మొల్లకవితోత్ఫుల్లహృదంతా-ముద్దుపళ్ళనీప్రణయలతాంతా!

కోటిత్రయజన సేవితచరణా-కోమలజాతీకుసుమాభరణా

లలిత కౌముదీ సురభిళకీర్తీ-లావణ్యసుధామాతృమూర్తీ!.జయ.

— బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు.

# *భారతీదేవి

భరతఖండంబు చక్కనిపంటతల్లి
భరతదేశంబు మేలైన పాడియావు
భరతరాచరికంబుమా ప్రజలవాక్కు
అట్టితల్లి యాశీస్సునే నభిలషింతు.

శ్రీరామచంద్రుని శ్రేయోభిలాషచే
న్యాయసామ్రాజ్యంబు ఖ్యాతిగాంచె
బుద్ధమహాత్ముని సద్ధర్మ నిరతిచే
శాంతిభద్రతలెల్ల చాటబడియె
ఘనవివేకానంద గాంభీర్య మహిమచే
పంచభూతంబులే భయముజెందె
గాంధిమహాత్ముని జ్ఞానకిరణంబుచే
యంధకారంబెల్ల యణగిపోయె

శాంతమూర్తులు, ఘనతపశ్శాలురున్న
న్యాయవిక్రమ పరిపాల నాయకులును
సత్యవ్రతులు, యహింసాది శక్తియుతుల
బిడ్డలను గనిపెంచిన దొడ్డమాత
భారతీదేవి నానమస్కారమమ్మ.

## *కాపుబిడ్డ

కూర్చి కూర్చి మొత్తిడికొన్న గుమ్మిపొట్ట
కాపుపొట్టను నింపని కతమదేమొ !
చింపులన్ గింజగార్చు నీచిట్టిజోలె
నీదుపొట్ట నెల్లప్పుడు నింపులేమొ.
కాదెనీయెద్దుపోటు రక్తంపుచుక్క
నృపుని మకుటాన వెల్గు యాకెంపుముక్క
మసలు నీదగునుదుటి చెమ్మటలజాలు,
అధిపునుదుట ముత్యాల కుచ్చుగుచువ్రేలు.

—వానమామలై వరదాచారిగారు.

## *ధనికుడు-బీద

కడుపుకుచాలిన కబళములేక
ఒడలికిచాలిన ఉడుపులులేక
బీదలుచావక బ్రతుకుటెందుకో ?
కడుపుకుచాలిన కబళమువుండీ
ఒడలికిచాలిన ఉడుపులువుండి
ధనికులు బ్రదుకక చచ్చుటెందుకో ?

అనువాదకులు
—కాళోజి నారాయణరావుగారు.

# ఆనందుడు

*పెండ్యాల రామానుజరావుగారు.

మార్గశీర్షమాసము. సాయంసమయము. ఆనాడు పర్వ-దివసము కాబోలు చలిమిక్కుటముగా నుండెను. గోవిందరావు దుఃఖపూరితమైన వదనముగలవాడై, శక్తిహీనమైన గద్గదకంఠస్వరముచే "లలితా! నాస్థితిని గ్రహించితివి. నీవు వైధవ్యము ప్రాప్తింపబోవును. కావున ధైర్యమవలంబించి కష్టపరంపరల నతిక్రమించి నాచిన్ని ఆనందుని రక్షింపుము" యని ప్రాణములు విడిచెను.

గోవిందరావు మరణవార్తవినగానే జనసామాన్యము వారి గృహమున గుమిగూడిరి. కాని, రావుగారి స్వజాతీయులెవరచటికిరాలేదు. లలితరోదనధ్వనులు అచటి వారల హృదయములందు ప్రతిధ్వనించుచుండెను. రాత్రిగడచుచుండెను. బ్రాహ్మణవిద్యుక్త ధర్మానుసారము ఆరాత్రియే ప్రేత సంస్కారము కావలసియుండెను. సంస్కారవిధి నిమిత్తమై కావలసిన సామగ్రిని సంగ్రహించుటకెవరును లేకపోయిరి. పాపం! అట్టి సమయమున ఆనందుని లలిత తనస్వజాతీయ పెద్దమనిషి వద్దికి పంపించెను. లలిత వారిచేతులలో కొంతద్రవ్యము పెట్టగా నిరాటంకముగా నాటిరాత్రి దహన సంస్కారము నెరవేరెను.

మూడవరోజు అస్థుల తీసుకొనుటకై లలితా, ఆనందు లిద్దరును శ్మశానమునకు వెళ్ళిరి. ఆరోజెవరు జ్ఞాతులు రాలేదు. అస్థులన్నింటి నొకచో జేర్చి నొక వస్త్రమందు కట్టుకొని చేరువగల నదియందు నిమజ్జనము జేసిరి. నదీమతల్లి పాపమీ లలితావతల్లి దుఃఖమును పశమించుటకో యనునటుల పరుచుండెను 'యీ ప్రపంచ పీఠమునుండి నేడు నీవుపోవుచున్నావా?' యంచు రెండు దుఃఖబాష్పములు విడిచెను లలిత. యీనామె దుఃఖమునకా నదీమతల్లికిగూడ సంతాపము కల్గకపోలేదు కాని గంభీరముచే దుఃఖము నాపుకొని లలితాదేవి విడిచిన అస్థుల మూటనీకొనిపోయి యెచట దాచెనో తెలియదు.

ఆనందు బాలుడు. భవిష్యద్వర్తమాన పరిస్థితుల నంతయు అయోమయముగా నుండెను.

పదియవరోజు స్వజాతిలోని పెద్దమనుష్యులు కొందరువచ్చి పలకరించి దుఃఖించకూడదని బోధచేసి ముందు జరుగు కార్య క్రతువులను గూర్చి విచారించిరి. లలిత తననిస్సహాయస్థితిని తెల్య చేసెను. కాని యీ పెద్దలు శాస్త్రములన్నిటని ముందుపెట్టి అన్నదానము కొందరు వారలకైనా యిప్పించనిచో గొప్ప నరకము ప్రాప్తించునని భయపెట్టిరి.

హిందవ నారీమణులు విధి, నరకము అనగనే భయ

భ్రాంతులై దానిని నరవేయుటకు సిద్ధమైనారు.. వీరుచాలా మెత్తని హృదయము గలవారలు. కావుననే లలితాదేవి తనపై నున్న సొమ్మంతతీసి వారల చేతులయందు పెట్టగనే వారు సంతోషించిరి. అపుడు తగిన ప్రయత్నములన్ని చేసిరి. నాడు పరాటాకముగా, మనసార, ఆరువందల అగ్రజాతి శిఖామణులు ఆహారము లారగించి పొట్టలు గీకుచు సంభావనలకై నిరీక్షించుచుండిరి అపుడు యేమిచేయవలెనో పాపమూ లలితాదేవి కేమితోచలేదు. భోక్తల సంతృప్తియే మృతజీవి సంతృప్తియని బోధించిన పెద్దలవాక్యములు ఈమె మనస్సును భయపెట్టుచుండెను. కావున తన భర్త ఆత్మశాంతికై, తనభర్త ఆస్తినంత వ్యయపఱచుటకు సంతసించి ఇత్తడి పాత్రలన్ని యమ్మివేసెను. చూచుచుండగానే పెద్దలు వానినిగొనిపోయి వారల యిష్టమునుసు దామకొని పైకముదెచ్చి సంభావనలర్పించిరి. "అమ్మా! నా చెంబెచటికీ పోవుచున్నది, మానాన్న కొనిచ్చినదే" యని భోరున యేడ్చెను ఆనందుడు. కాని పాప మీబాలుని భావిజీవితమేమౌకాని ప్రస్తుతస్థితిని పరామర్శించువారు పెద్దలనిచెప్పి కుటుంబ నాశనముచేయు స్వజాతీయులా! కల్ల-

తెల్లవారగనే గృహమందెచటచూచినా చిన్నపోయిన గోడలు, నిరాధారజీవితములు జూచుకొని లలితాదేవి హృదయము

బ్రిద్దలై దుఃఖవాహిని నయనములగుండా ప్రవహింపసాగెను. తన ఆత్మహత్యకై ఎన్నియో ఉపాయముల బన్నెనుకాని ఆనందుని జీవితము, తననాథుని వాక్యములు ఆమె ముందు ప్రత్యక్షమాయెను.

జీవిత పరమావధి నిమిత్తమామె భిక్షమెత్తుకొనుటయే సమంజసమని తలచెను. ఒక బట్టలమూట శిరముపై నిడికొని ఆనందుని చంకన పెట్టుకొని ఇంటి బయటికి వెళ్ళగనే ఆయింటి యజమాని ఆమెనాపి అద్దె, యడిగెను. 'నావద్ద అద్దెయిచ్చుటకు యీ దుఃఖాశ్రువులు దప్ప మరేమిలేవు. యీమూట యందు కట్టుకొనుటకు బట్టలుకలవు, మిగిలిన నాయాస్పదమంత నా స్వజాతీయులు అన్నదానమునకై వినియోగించినారు,' అని దీనముగాయనెను. దీనిపై ఆయజమానునికి జాలికల్గి పెద్దమనుష్యుల చర్యపై నిరసనముకల్గి సంఘ దురాచార వ్యామోహ దేవతపై ఆగ్రహము బూనినట్లు నటించెను.

లలిత పెద్దమనుష్యుల యందొకరి యింటికేగి "భిక్షాం దేహీ" యనెను. యీమాట యాతని చెవినిబడగానే 'వెళ్ళు వెళ్ళు' మని బయటికి కరుదెంచెను. "అయ్యా! నా ద్రవ్యమంత శాస్త్రములను దొంగలచే కొల్లగొట్టించి యిపుడు నాస్థితినైనా జూడక స్వజాతి దానవైన నాపై దయలేక యుంటిరా" యని బ్రతి

మారెను. కాని యాతడు క్రోధావేశ పరవశుడై తన నెకరుచె లలిత నావలకి గెంటించివేసెను.

ప్రతిరోజు భిక్షమెత్తుచు ఆనందుని సాకుచు కొన్నిరోజులు కాలముగడిపినది. కాని యిప్పుడానందుడు ఆరుసంవత్సరముల ప్రాయము గలవాడే!

ఎవరినిగుఱించి భిక్షమెత్తుచు కాలముగడపినదో, ఎవని ఆజ్ఞానుసారము జీవితమును సల్పికొనినదో యా లలితాదేవిని ప్రపంచమునుండి దీసికొనిపోవుటకు కాల మాసన్నమాయెను. ఒకచోట పరుండి తన శరీర ధర్మములన్నిటిని మరచిన లలితాదేవి, ఆనందుని అంత్యదర్శనమునకే నిస్సత్తువగల కనురెప్పలు తెరచెను కాని ఆనందుని అంత్యదర్శనము అసంభవమాయెను పాపము ప్రాణములు విడచెను.

ఆనందుడు ఆటలాడుచు ఆకలికాగానే 'అమ్మా! అమ్మా'! యని దగ్గరికిరాగా ఆయమ్మ పలుకని కారణము తెలిసికొననివాడై ఏడ్వనబడెను. కాని పాపము యానందుని కాశవము మంటికుప్పగాని తల్లిగాదు. కాని వానికేమి తెలుసును. ఆనందుడు తన మాతృప్రేమను మరవజాలక, మాతృశక్తి గుఱించి ఏమైనదోకదా! వీనికష్టములకు మూలమెవరో వారు వీనిభావి జీవితమునకు బాధ్యులయ్యెదరా?



★ మనపైన మేనేజర్ రూపాయికన్న విలువైనది. ఎందుచేతనంటే మనంచెమటోడ్చి రక్తం ధారవోసి దీన్ని సంపాదిస్తున్నాము. మేనేజర్ వెండినాణెములకన్న ఈ రాగినాణెంలో మానవరక్తం ఎక్కువయి మిడివుంది.

*　　　　*　　　　*

ధనము ఒక గొప్పశక్తేగాని సత్యానికి ప్రబలమైనవిరోధ.

*　　　　*　　　　*

ధనికుల అధికారానికి సత్యమే గొప్పశత్రువు. ధనానికి సత్యానికి రాజీయన్న మాటలేదు.

—గోర్కీ

×　　　　×

× ×　　　　× ×

నవ్వించడమంటే వెక్కిరించడం కాదు. బుద్ధికి హృదయానికి గిలిగింతలు పెట్టేదే నిజమైన హాస్యం.

*　　　　*　　　　×

చైతన్య స్ఫూర్తితో పరిశీలింపగల్గిన వ్యక్తికి సౌందర్యమంతటా సాక్షాత్కరిస్తుంది.

*　　　　*　　　　*

రచనలంటే ఒకవిధమైన ఆత్మవ్యక్తత. అందులో ప్రపంచం తెలిసికోదగిన ప్రత్యేక విశేషమొకటివుండితీరాలి.



# దీపావళి. *సముద్రాల లక్ష్మీనరసయ్యగారు.

ఆనాడు దీపావళి అమావాస్య. గొప్ప గొప్ప ధనికులు మహాభోగ్యంగా పండుగ చేసుకొంటున్నారు. పట్టణ మంతా కళకళ్ళాడే దీపకళికలు కన్నులకు ఇంపుగా కనుపిస్తున్నాయి. ధనికులు నూతన వస్త్రధారణ చేసుకొని మంగళారతులు తీసుకొని పరమాన్న పంచభక్ష్యములతో విందులుగుడుచుచున్నారు. పెద్ద పెద్ద మేడలు బంగారు పాన్పులు, దూదిపరుపులు, అత్తరునూనెలు బుగబుగలాడు రసపాకములు, యెడచూచినా లక్ష్మీప్రసన్నమే. మేళతాళధ్వనులు పట్టణమంతా మారు మోగుతున్నాయి. మేడలలో పచ్చకర్పూర దీపాలతో లక్ష్మీదేవి పూజలు చేస్తున్నారు. కట్నములు ఇచ్చువారు పుచ్చుకొనువారు, యెవరి గృహమున చూచినా మహా హడావిడి, వారి రీవివారి పోకడలు అదో మాదిరి మహా ఉత్సాహంతో పొంగిపోతున్నారు ధనికులు.

ఆ పట్టణానికి వెలుపల భార్యాపిల్లలతో సగము కూలిపోయిన గుడిసెలో అన్నములేక నకనకలాడే పొట్టలతో మహా దరిద్రము అనుభవిస్తున్నాడా నిర్భాగ్యజీవి. అతనియింట యిను పగక్షల తల్లి పరిశయ నాట్యంచేస్తోంది, బక్క చిక్కిన జీర్ణ దేహాలతో వెన్నుకుఅతుక్కుపోయిన పొట్టలతో వికార స్వరూపాలతో కౌపీనధారణాలతో మూల్గుతున్నారు. ఆనాటి కిరెండు

రోజులనుండి కూడు లేక ఆబాల గోపాలము స్పృహతప్పి ఈ మూలకొకరు ఆమూలకొకరు పడిపోయినారు. పండుగొనుటకు నాపైనా గతిలేదు! పాపమూ యింటిముందు దీపము వెలిగించు టకైనా చమురు లేదు. దరిద్రులకు.

పట్టణాన జరుగు మేళతాళధ్వనులకు మెలకువ వచ్చింది వృద్ధునికి, యేమిటీధ్వని అనిలేచి కట్టెచేత పట్టుకొని మునలి పట్టణము వైపుకు వెళ్లుచున్నాడు. ఒక్కసారిగా అతనికి ప్రాణములు లేచివచ్చినవి, ఇవాళ్ళ దీపావళా! అనుకున్నాడు. వెంటనే వెనుకకుతిరిగి ఊగులాడుతు సంతోషంతో గుడిసెకువెళ్లి భార్యాపిల్లలను లేపుకొని ఆసమాచారము చెప్పి జోలెలు తీసుకొని పట్టణములో పలికి వెళ్లి ఒక భవనము ముందు ఆగి, అమ్మా రెండు దినాలైంది అన్నాడా బికారి పొట్టచూపుతూ వాళ్లి ముఖాలుచూచి అసహ్యాపడి ఈర్ష్యతో

''యువతి" యేమినీముఖం?
''బికారి" అన్నము లేక తల్లీ!
''యువతి" అన్నము లేకపోతే ఈపండుగుదినం కూడా భిక్షమేనట్రా?
''బికారి" పండుగ నేకదా అమ్మా వచ్చింది, కబళముముద్దపెట్టు
''యువతి" కబళము లేదు గబళము లేదుపో.
''బికారి" ఆకలి మంటచే మలమల మాడి పోతున్నాము తల్లీ

''యువతి'' అయితే యేమంటావు పెట్టుమంటావా।

''బికారి'' అమ్మా! చూడు. ఈపిల్లలు యెట్లు కూలగిలబడి పోతున్నారో। నీబిడ్డలైతే యిట్లు అందువా తల్లీ, పుణ్యాత్మురాలవు, ఇలాంటి బిడ్డలు నీకు కలుగుతారు. కబళము పెట్టి మరచిపోదురుగదా। పుణ్యం ఉంటుంది తల్లీ।కలిమిలేములు శాశ్వతములా!

''యువతి'' ఓరీ। నీకదంతమండా, పుణ్యమంటూ దానమంటూ నీవెవడెవ్వు. ల్లలు నాకు కలుగాలంటావా. ఇండ్లల్లో అడుక్కో. తినమరిగి నీతులు, సూక్తులూ, దానాలూ పుణ్యాలుఅంటూ నీగొడవ నీవునాగొడవా నేననూ అదుగో ఆమాస్నేహితురాలు తన భర్తతో యెట్లు సంసారాడుతుందోచూడు.

'బికారి'' తల్లీ యీ దవ్వసం శాశ్వతమా ప్రాణాలు పీకుతున్నాయి.

'యువతి'' నీముఖం వెళ్ళు, అని తలుపు బిగించుకుంది.

పాపమా బికారి పట్టణమంతా తిరిగి తిరిగి వేసారినాడు యెవరి యింటికి వెళ్ళినా యేదో సాకు వినబడుతుంది. బికారి మోజులాలించు వారెవరు? కష్టపడ్డ జీవులైతేగా తెలిసేది, పాపము, పుణ్యము వారికి యేమిలెక్క తోడిమానవుడు ఆకలిమంటచే మలమలమాడి పోవగా చూచేఅమనుజ రాక్షసులకు

ప్రపంచమే తలక్రిందుల కనుబడతుంది. బీదల రక్తము పీల్చి పిప్పిచేసే ధనిక వర్గానికా! దయాదాక్షిణ్యాలు. వారి సంపదంతా బీదల రక్తము గాక యేమౌతుంది. స్వర్గానికి తంతెలు కడుతారా?

శూన్యముఖాలతో వారు ఆ నడురేయి ప్రయాణమై ఒకపల్లె దారిబట్టి పోవుచుండగా త్రోవలో ఒక తోట బావి కల్పింది. అక్కడికి చేరగడిసెలో వున్నముసలవ్వతో వారి సమాచారము చెప్పగా ఆముసలవ్వ సంతోషించుకుంటూ నాప్రాణము ఉన్నంతమట్టుకు పోషించుతూవుండు. అని చెప్పి తాను ఉడికించుకున్న కందగడ్డలను వారి అందరికి పెట్టింది.

అప్పుడు వారిహృదయాలు దీపాలై వెల్గినవి.



*కొడవటిగంటి కుటుంబరావుగారు.

★ సాహిత్యరచనకు వస్తువనేది వుండాలి. ఇది జీవితానుభవంవల్ల లభిస్తుంది. కావ్య వస్తువు కోసరము ప్రతివాడు ముందు తనలో వెతుక్కొని కాని బయట వెతకడు. దానిని తనలోనే అంటె తన అనుభవంలోనే చూచుకోగలవాడు అదృష్టవంతుడు అదిచూచుకోలేని వానిలోపలనుండి వచ్చే ప్రేరేపణ వూరుకోనివ్వదు. అందుచేతవాడు-సాహిత్యవీధులన్నీ వెదకి తనకనువైన విషయం తస్కరించి తెచ్చిఎంగిలి సాహిత్యంసృష్టిస్తాడు.

## యదార్థ విషయము.

యుద్ధము ఆరంభము కావటానికి కొన్నిరోజుల పూర్వ విషయం. ఒక అమెరికన్ పత్రికావిలేఖరి టోకియోనుండి, చికాగోలో ఉండేతన ప్రియసిపేర ఓ ప్రణయలేఖ రాశాడు. దూర దేశంలో నివసిస్తుఉన్న ఆ సంజయుడు ఆఉత్తరములో తన హృదయ బాధనంత చూపెడుతు చివర ఈముక్కలు రాశాడు.

ఈ త్తరమునీకు చేరుతుందని నాకు నమ్మకంలేదు. జపాను సెన్సారువారు ఈ ఉత్తరాన్ని బిగయపడితే, నీనాసంబంధం కొన్నాళ్ళకు తెగిపోయినట్లె ఇంతకు ఈఉత్తరములో అక్షరం, అక్షరము, వెదకిచూచినా రాజకీయ వాసనకనపడదు. యిదంతా ఒక విరహవేదన. అయినాఏమి! నాఉత్తరము భద్రంగాచేరిన నాదుకదా! నాహృదయవేదన నీవుతెలుసుకునేది.

వుత్తరము మాత్రము చికాగోచేరింది. కాని పత్రికావిలేఖరి పేర జపాను సెన్సారులు, తపాలాధికారులు ఒకచీటి పంపారు. దాంట్లో ఈవిధంగావుంది" మీరు తమ ప్రేయసి పేరరాసిన వుత్తరములోని తుదివాక్యాలు కేవలము అనుమాన పూరితమైనవి. మేము యెవరివైనానరే! గృహవ్యవహారాలకు సంబంధించిన వుత్తరాలు విప్పిచూడము.

"ఆర్టికల్" నుండి అనువాదం.

# * శిధిలలుము.

శారదపస్నిగ్ధకౌముదుల స్నానమొనర్చి మనోజ్ఞకాంతి, వి
స్ఫారితవరాచు నీనగర సౌధములెన్నడో దర్శనీయమై
రామినించె నెమ్మదినిగూఢ చలత్ప్రమయ ప్రభావమీ
తీరున పాడుబడ్డపెను. గబ్బిలజేసె భయాస్పదంబుగన్.

ఈసువిశాల సౌధకమనీయ సభాభవనాంతరమ్ములన్
గాసిలె నర్తకీపథు గణమ్ముల అందెల సవ్వడుల్ మనో
ల్లాస సుధాపరిపూర్ణ మధురస్వనగానక లాపమెన్నడో
మోసపు రేయులూకముల మోతలు నేడిట నిర్వనించెడున్.

పరిమళ వస్తుసంచయ సువాసనలీయెడ వీచువాయుదోం
తరలు, లయించి నల్దిశల దావుల జల్లిన ఈప్రదేశ ము
ప్పరువుగ, పాడుగబ్బిలపు పుల్గులరొచ్చెడు గంపుచేత దు
ర్భరము, నసహ్యమై నిలువరాని స్థలమ్మయి పోయెనక్కటా!

ఆపరిసాదాంగణో పవనపరిఫుల్ల
పుష్పసౌరభ్యములెన్నడ పూర్వమాయె
కానుపించును పల్లేరు గాయలుమ్మొ
తలును, నాజీర్ణ శిధిల సౌధములయందు

న్యాయపు దీక్షగైకొని దయార్ద్ర మనస్కులునై ప్రజాళి, నా
త్మీయుల భాతినెయ్యమున నేలెడు ఱేండ్లు వసించుచోటు, లా
హా! యమకింకరుల్వలె కృపాంబు దరిద్రులునై జనాళి, న
న్యాయము దోచుచోరులకు నాస్పదమాయెను కాలబద్ధమై.

మలయసమీరుడీ వనసుమమ్ముల చెక్కిళులంటు వేళ, క
న్నెఁతోలి ప్రేమభాషణ, వినిస్వనముల్చెవిసోకెనాడు, శ్యా
మలరుచు లారిపోయి, యశోభ ప్రతిపాదకత్తై నవల్లకా
డుల, జనియించు బూడిద సుదుల్చెల రేగును నిచ్చలిచ్చటన్

ముష్కరవిరోధి దుష్కృతమ్ముల సహించి
విస్మృతిని ద్రోయుకాల దుర్విధికినాగి
మనుచునున్నవి పూర్వవైభవముజూప
ఆగియుండునోయింక కల్పాంతమందు.

—వంగల రుక్మారావుగారు.



# పైసా

* సంతపురి జానకిరామారావుగారు.

నేను, రామారావు కొన్ని వస్తువులు తెచ్చుటకై బైస్కిలు పై బజారుకెళ్ళి నాము పట్నంలోకిసామానులు సైకిలు హ్యాండిల్ కేసితిర్గి వాపస్ ఇంటివైపు వచ్చుచుంటిమి. దారిలో చాలా మంది ప్రయాణీకులు గుంపులు గుంపులుగా వచ్చుచుండుట బట్టి సైకిల్ గంటను మ్రోగించుచు బ్రేక్‌ను వేయుచు మెల మెల్లగా వచ్చుచుంటిమి. హఠాత్తుగా ఒక ముదుసలి బిచ్చగాడు మాదరిని సమీపించి 'బాబూ' ఒక పైసఅనెను. రామారావు 'పోమ్మ! ఎచటికైనానేగి నౌకరిచూచుకొమ్మ' నియెను. నేను నిస్తబ్ధుడనై ఊరకుంటిని ముసలి బికారి మావైపుచూచుచు తన కడుపుపై చేయినుంచి 'బాబూ' నిన్నటినుండి అన్నంలేదు చాలా ఆకలిఅగుచున్నది కడుపులోని ప్రేగులు అరచుచున్నవి. కరుణదాల్చి ఒకపైస యివ్వండి బాబూయని తన అమాయకపు చూపుచే ఆకలిజ్వాలచే మాటవచ్చి రానట్టు మన్నర్థించెను. ముసలి బికారిని నేను బాగుగా పరికించిచూచితిని. శరీరము పూర్తిగా వంగిపోయినది. చామన ఛాయగల శరీరము, తెల్లని గడ్డము, లోనికి ఈడ్చుకపోయినకళ్ళు, పాతగుడ్డ పేలికలు చిరిగి పోయినవి ధరించి ముదుసలి ముందునకు సాగిపోవుచుండెను.

దారిలో నేను రామారావు పోతూ ఇలా ప్రసంగించు కున్నాము. హిందూదేశము బికారీలకు తావలంబు. మనము ఎవరినిచూచినను ముష్టెత్తుట చూచుచునేయున్నాము. మనకు బికారీలపై దీనదృష్టికల్గుట సహజమే. మన దేశంలో ముష్టినెత్తి జీవనము గడుపుకొను వారిసంఖ్య హెచ్చిగానున్నది. వీరువచ్చి మనల నర్థించినపుడెల్ల మనమేదో ఇచ్చి పంపుటం, వీరల నిర్జీవుల చేయుచు ఏమిపనిచేయుటకుగూడ ఉత్సుకత లేకుండా చేయుచున్నామని ప్రసంగించుచుండ మరల బికారి వీరికడకే తెంచి 'బాబూ' దయదాల్చండి ఒక్కపైస అని దీనవదనముతో పలుక రామారావు పొమ్మని గద్దించెను. ఐనప్పటికి భిక్షుకుడు మావెనకాలే రావటం ప్రారంభించినాడు, ఆశాదృక్పథంతో వెంటబడితేనేగాని యేమైనా దొరుకుతుందనే మొండిపిపాసచే. ఎందుచేత వీనికింత మొండిపిపాసంటారేమో. చూడండి సూట్ హ్యాట్ వేసుకున్నవాళ్ళు తప్పక యేమైనా చేతులో వేయక పోతారాయని, రామారావు తనసైకిలు నాపికోపపు దృక్కులతో మావెంట పడ్డావేమిటి. మావద్ద నీలాంటి సోమరులకు డబ్బిచ్చేవాడుక లేదుపో! అన్నాడు. మేము తిరిగి వెళ్ళడం మొదలెట్టాం. ఇంతకు ముష్టివాడు మావెనువెంట రావడం మాని వేయకుండా వస్తున్నాడేమో కాబోలు. ఇంతలోనే మోటారు హార్న్ అలజడివినిపించింది. మేమిద్దరం పైడిల్ ద్రొక్కుచు

ముందునకు సాగిపోతున్నాం. రామారావువన్నడిగాడు సిగరేట్ వుందాఅని. లేదని జవాబిచ్చాను నేను. ఐతే సీజర్ పెట్టె కొనముందువా అన్నాడాతను. సమీపముకొట్లో ఒకసీజర్ ప్యాకెట్ కొని సిగరేట్‌ను కాల్చుచు కాలేజి హాస్టల్లోకి ప్రవేశించితిమి. అప్పుడే రమేశ్ కల్సి నిన్న మీరు ఆగలేదు మోటారు హార్న్ కూడా ఇచ్చితిని. మీగురించి పాపమాబికారి.— —

రామారావు దీనవదనంతో ఏమీ రాడు మరణించెనా. అవును పాపం. ఆ అమాయకుడు మోటారు హార్న్ చప్పుడుకు గాభరాపడి క్రింది కొచ్చేశాడు. ఎలాగైతేనేమి ఆబీదవాని ప్రాణమైతే పోయిందిగా. వాని ప్రాణమేమి లెక్కకొస్తుంది. ఈ ప్రపంచంలో వాని ఖరీదు ఏముంటుంది. వీనికొఱకు ఏడ్చువారు యెవరు. వీనికొఱకు ప్రపంచపు పనులాగబోతాయా అన్నాడు రమేశ్ నావైపు చూస్తు నేను. ఊ। అంటూ రమేశ్ అసలు మా ఉేమిటంటే సిగరేట్ తాగడం తప్పనిసరి. అవి దుబారా ఖర్చులుకావు. లోకంలో ఎంతమంది తమడబ్బును దుర్వినియోగం చేయుటలేదు. కాని ఒక పైసకై బికారి తన ప్రాణాన్ని ఆత్మార్పణం కావించుకున్నాడు. దీనికేమి వెల లేకుండా పోతుంది కాబోలు అని అన్నాను. ఇంతలో రమేశు తనదారిని పట్టాడు. నేను చాలాసేపువరకు ఈ విషయమై ఆలోచించాను. ఇదంత ఒకపైస కొఱకేగా! అని సిట్టూర్పు

విడిచి అశ్రువులు రాల్చాను. తదుపరి యెవరికి వారే యమునా తీరేమాదిరి అయిపొయ్యాం.

పాఠకలోకం గ్రహించ వలసిన దొకమాట. అదేమంటే మనము పేదవాళ్ళయందు విశాల దృష్టిని ప్రసరించి వారిని ఆదరించి యేదైన పనిని కల్పింపజేసి సాధ్యమైనంత సేవ జేయుట శ్రేయస్కరము.



## నమస్తే! ✶ *"భరద్వాజ"

మానవుని నిత్య కృత్యములో అనుభవించే అవస్థలల్లో ఆశాభంగమొకటి.

* * *

పరాభవముకన్న పదిక్రోసులు వెళ్ళింది ఉత్తమం.

* * *

కరువు దినాలో పెండ్లి దండ యాత్రలు. ప్రత్యేకించి హైద్రాబాదులో 12 డిసంబర్ రోజు 801 పెళ్ళిళ్ళు.

* * *

పేదరిక జీవితమంటే శరీరమునకు క్షయలాంటి దన్నమాట

* * *

' మణి ' వద్ద పరిపూర్ణ పర్సనాలిటి ( Personolity ) వుండడంచేత ' money , సినిమా మార్కెట్టులో చలామణి కావడానికి ఆస్కారంవుంది.

* * *

మన మహిళా సంఘానికి మంత్రాలు తంత్రాలంటే మహాభక్తి. ఈ మూఢ విశ్వాసము ఇంకా పట్టుక పీక్కు తింటుందేం ?

* * *

చదువుకునే వయస్సులో సంసారిస్తుంటే హాల్ఫికి హాల్ఫి సున్నకు సున్న.

* * *

పిరికి పందల బతుకు పిచ్చాపాటిలో శ్రీ రామాయణాలు ఆరంభ శూరత్వాల కార్యక్రమాలతో గడుస్తుంది. కాని అంతా నిరర్థకం.

* * *

చదువుకున్న వాళ్ళంతా జానపదుల సేవ జేస్తే లోకకల్యాణం తొందరగా అబ్బి దైవసాన్నిధ్యానికి దారి యేర్పడతుందనుకుంటా.

  

# విశ్వప్రేమ

*సర్వదేవభట్ల నరసింహమూర్తిగారు.

రాధ చేసిన కార్యం పాపభూయిష్ఠం. ప్రస్తుత మామె కులట, కళంకిని. రాధ శరీరం పరస్వాధీనమైన కళేబరం, ఆత్మ మాత్రం అగ్నిసాక్షిగా పరిణయమాడి, శిరస్సుపై దిక్పాలకుల సాక్షిగా, మహత్తరమైన వైదిక మంత్రములతో పసుపు బియ్యము చల్లినవాని బానిస.

అతడు ముసలి. కామక్రోధలో భాలణగిపోయిన వాడు కావునే ఆ పుత్రుడు తనవాడు కాడని గుర్తించినాడు. కొందరు మేనమామ పోలికని మరికొందరు అక్కకొడుకు పోలికని అన్నారు. ప్రపంచమునకు మాత్రం రాధ కళంకని అని తెలియదు కావునే సాహసించి నిర్ధారణ చేయలేకపోయింది. "గుమ్మడికాయల దొంగ" అంటే భుజాలు తడుముకున్నాడు ముసలి. తన పరిస్థితిని బాగా గుర్తెరింగి అనుమాన నిర్ధారణకై ప్రబల ప్రయత్నం చేయసాగాడు.

స్నేహబంధము మాంగల్య బలంకంటె, మాతా పితృవాత్సల్యంకంటె మహత్తరమైనది. ఆ స్నేహిత సంబంధము యొక్క పరిపక్వ దశయే స్త్రీపురుషుల లౌకిక సంబంధమునకునాంది.

భగ్నవేశ్రమికు లిరుపురు ఒకనాటి కేయికలుసుకున్నారు. ఒక దానిపై నొకటి స్వారీ చేయుచున్న మబ్బు తునకల మింట జూచి నవ్వుకున్నారు.

కార్య దీక్షాతత్పరుడైన ముదుసలి తన ప్రయత్నంలో విజయలక్ష్మిచే వరింప బడ్డాడు "నీవు నాకవసరం లేదన్నాడు, నిష్కర్షగా." పావనమైన హిందూమత సిద్ధాంతములు అన్యాక్రాంతమైన వస్తువును ముఖ్యముగా స్త్రీని దగ్గరకి తీయుటకై సమ్మతింపవు, అన్నాడు. రాధ పొరపాటు యినదని ప్రతిపాలింది కాని ఆముదుసలి పాపమొనరించి పశ్చాత్తాప పడుట మరో పాపమన్నాడు. ఒక ఒరలో రెండు కత్తులి మూడవన్నాడు.

  

ఆకాశం శూన్యంగావుంది. నల్లటికారు మబ్బులు ఒక దానిపై నొకటి, కేళీవిలాసాలు జరుపుచు సాగుచున్నవి. ఆనల్లటి మబ్బుల్లో ఒక మెఱుపు తళుక్కుమంది. రాధ తన పాపను తీసుకుని బైలుదేరింది. కష్ట పరంపరలోనే భక్తి రేకెత్తింపని శాస్త్ర ప్రమాణము. రాధ తిన్నగా నడుస్తూ శూన్య ప్రపంచాన్నిచూచి చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వు ఎండిపోయిన పెదవుల మీద అంకురించి క్షణంలో మాయమైంది. రాత్రంతా ప్రయాణం సాగించింది.

దివాకరుడు తన ప్రయాణాన్ని సాగించినాడు. పాపాయి కెవ్వుమన్నది ఆశబ్దం రాధ చెవిగుండాపోయి హృదయానికి బాణమువలె సగిలింది. రాధ త్రుళ్ళిపడ్డది. పట్టణంలో వ్యక్తు లంతా వేగ తమ పనులకు పోవుచున్నారు.

"అమ్మా! పాపాయికి ఒక ముద్ద అన్నం?" అంది రాధ.

"మేము బ్రాహ్మణులం, ఇప్పుడే వీలుకాదు" అంది ఆవిడ.

"అమ్మా! ఈ చిన్నపాపకు కబళం" అందిరాధ

"మేము విద్యార్థులము, ఆడవాండ్లులేరు అన్నాడా తను బైటకు వస్తున్న తనతల్లిని లోనికి వెళ్ళమని సైగచేస్తూ.

"తల్లీ! బువ్వ" అందిమరో యింటి ముందు. తెల్లనిరవి బింబము ఎర్రబారింది.

యువకులు తమ గృహిణిలను దర్శించుటకై కాబోలు ఆత్రంగా ఇండ్లకు వస్తున్నారు పొలములనుండి. కొందరు యువతులు శృంగారించుకొని తమ భర్తల నాహ్వానిస్తున్నారు అందు కొందరు వీధివెంటనడిచే యువకులను చూస్తూ తమవిధిని తిట్టిపోసుకుంటున్నారు.

సమయము చాలా ప్రశాంతంగావుంది. కబళము తీసి కొని సమీపమునవున్న తటాకము వద్దకు వెళ్ళింది రాధ పాపమా పాపకు అన్నంపెట్టి తనుదోసెడు నీళ్ళుమాత్రం తాగుదామని,

తటాకము మౌన సమాధియందున్న బుద్ధదేవునివలె ప్రశాంతం గావుంది. తటాకమునుండి చిన్న చిన్న అలలు ఉత్పత్తిఅయి క్రమేణా క్షీణిస్తూ ఒడ్డుకు జేరుచున్నవి ముసలమ్మవలె.

" అమ్మా! లే, ఇదిగో అన్నంతిందువులే " అంది రాధ లేనిబలం తెచ్చుకొని.

కాని పాప సమాధానమివ్వలేదు.

"అమ్మా! అమ్మా!" అని మరల అంది. ఆధ్వని విచార పూరితమై విషాదంగా ప్రతిధ్వనించింది. ఆధ్వని ప్రథమ శ్రుతిలో రాగోత్పత్తి అయినట్లు బొంగురుగా వెడలింది. అప్రయత్నంగా రాధ కండ్లనుండి రెండు అశ్రుబిందువులు నేలపై రాలాయి. పిల్లను కదల్చి చూచింది. కాని పాపమా పసిబిడ్డ పరమపదించిందని తెలిసికొని భోరున ఏడ్వసాగింది. రాధ చేతులు వణకినవి. ఆమె చేతుల్లోనుండి పిల్లజారి క్రిందబడ్డది.

తనకీ విస్తీర్ణమైన ప్రపంచంలో ఏమీ లేదని ఇప్పుడు గుర్తించింది రాధ. ఆమె రోదన పర్వతాలను సైతము కరిగించింది కాని భగవంతుని లీలలను సంఘశాసనాలను మాత్రం కరగించలే.

నన్ను నీలో ఇముడ్చుకో తల్లీ! అందిరాధ.

"గుభిల్లు" మనే శబ్దం ఆనిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఆ వీధిలో పర్వ్యాతీసింది. ఆ శబ్దంతో పాటు తటాకంలోని కొన్ని బిందువులు పైకి లేచి ఒడ్డున వున్న బండమీదపడి జారిపోయినవి మరికొన్ని గరికపై, కొన్ని మరల తటాకములోనే కలసి పోయినవి.

కొన్ని మాత్రం తామర పత్రంమీదపడి ధగ ధగ మెరసినవి.



*వాఙ్మయంలో విలువగల లేఖలు వ్రాయాలంటే ఎంత సంస్కారం, ఎంతో విశాలమైన విద్య, జ్ఞానం, ఆత్మోన్నత్యం వుండాలి. ఎందుకంటె కామాన్ని సృష్టి ప్రతిజీవిలో లెక్కలేకుండా వలకబోసింది. కాని రసికత్వాన్ని, ప్రేమను, ఆత్మసౌరభ్యాన్ని చాలా జాగ్రతగా, విలువగా, కరువైనట్లు, అపురూపమైనట్లు, ఎక్కడో, ఎవరూ ఎరుగని, ఏ అనామకహృదయంలో నో కటాక్షిస్తుంది.

—చలం

తాటిపల్లి చంద్రయ్యగారు.

# కాలచక్రం

శ్యాము సామాన్య కుటుంబానికి చెందినవాడు ఐదారు ఎకరముల పొలము స్వంత. ఆస్తిగావుంది. ఆ గ్రామంలో ప్రభుత్వ పాఠశాలొకటుంది ఆపాఠశాల్లో నాలుగో క్లాసు వరకు విద్య చెప్పేదురు. తలిదండ్రులు శ్యామును ఈ పాఠశాలకు పంపిస్తుండే వారు. శ్యాము మంచి తెలివిగలకుర్రాడు. ఆ సంవత్సరము నాలుగో క్లాసులో ఉత్తీర్ణుడయ్యాడు కాబట్టి పెద్దచదువు చది వించుట కిష్టపడి ఆ గ్రామస్థుల ప్రోద్బలమువల్ల పట్ణాను పంపించి నాడు తండ్రి, శ్యాము అచట హైస్కూల్లో ఐదవ తరగతిలో చేరాడు. శ్యాము చాలకష్టపడి చదివేవాడు. స్వగ్రామము నుండి నెలకు ఇరువై రూపాయిలు కుమారునికి తండ్రి పంపించే వాడు. ఇవిచాలక ట్యూషన్లుగూడ చెప్పేవాడు. ప్రతి సంవ త్సరం పరీక్షల్లో మొదటి తరగతిగా ఉత్తీర్ణుడయ్యేవాడు. ఎలాగో కష్టించిచదివి బి. ఏ. ప్యాసయ్యాడు. కాని లాభం తండ్రి తనకొడుకు, ముందు ఏదో ఉద్యోగంచేస్తాడనే ఆశ పడితే శ్యాము ఎంత ప్రయత్నించిన ఉద్యోగమే దొరుక లేదు. ఈ బెంగవల్ల తండ్రి మంచంపట్టాడు. కొద్దిరోజుల్లో

పరలోక గతుడయ్యాడు. శ్యాముకు యేమిచేయాలో తోచక మద్రాసుకు వెళ్ళిపోయాడు.

మద్రాసులో తనకేదైన ఉద్యోగం దొరుకుతుందేమో నని ఆశచొప్పున ప్రయత్నం చేస్తాడు, తుదకొక హాస్పిటల్ కు చేరుకొని డాక్టరుగారిని కలిసి తనకేదైన పనిని చూపించుమని ప్రార్థించాడు. డాక్టరందుకు సమ్మతించి నీవు మా యింట్లో నే భోజనంచేసి హాస్పిటల్లో నాకు సహాయంగా వుండుమని చెప్పాడు. శ్యాముకు భోజనము పెట్టి నెలకు ఇరువది రూపాయిలు యిస్తుండేవాడు డాక్టరు. అందులో పదిరూపాయిలు తన తల్లికి పంపుచుండేవాడు.

ప్రస్తుతము డాక్టరుగారికి సహాయంగా శ్యాము చాల చురుగ్గా పనిచేస్తూ మెప్పును బొందుతున్నాడు. ఆరోజు చేతినిండా పనివున్నందువల్ల శ్యాము ఇంటికి వచ్చేవరకు రాత్రి అయింది. తనగదిలో కూర్చుండి ఏదో పుస్తకము చదువుచుండగా వంట మనిషివచ్చి భోజనానికి రమ్మని పిలిచింది. కాని శ్యామునాకు ఆకలేస్తులేదు అన్నాడు. ఆ రోజు శ్యాము వైఖరి పూర్తిగా మారిపోయి చింతాక్రాంతంగా వున్నాడేలకో ప్రకాశ్ అప్పుడే హాస్పిటల్ నుంచి వచ్చాడు. కమల భర్తరాగానే మన అమ్మాయి గురించి యేమైనా ఆలోచన చేస్తున్నారా! అని అడిగింది.

లోకులకైనా వెరచి అతి త్వరలో పెళ్ళి చేయకపోతే అప్రతిష్ఠ రాగలదనే భయముచేతనే ప్రయత్నంచేస్తున్నా కాని డబ్బుంటే చదువలేదు చదువుంటే డబ్బులేదుఅన్నాడు ప్రకాశ్.

కమల:-నేనొకమాట చెప్తా కోప్పడకండి!

ప్రకాశ్:-యేంటో చెప్పరాదు కోపమేమిటి. మన అమ్మాయి పెళ్ళికి మన మిద్దరముగూడ బాధ్యులమేగా!

కమల:-అయితే శ్యాముకిచ్చి పెళ్ళిచ స్తేయేం అదిగాక మనకు మగపిల్లవాడుగూడ లేడుగా? యింట్లోనే వుంచుకుంటాం

ఎలాగైతేనేం భార్యాభర్తలిద్దరు రాజీకొచ్చారు.

ఆరోజు డాక్టరుగారికి చేతినిండా పనివుంది. రోగులు బాగా వచ్చారు. చాలా సహాయమవసరమై తానుచేయవలసిన పనులలో కొన్నిటిని శ్యాముకు చెప్పాడు. అతడు బహుశాంతంగా చాకచక్యంగా నెరవేర్చాడు. అప్పుడేలకో ప్రకాశ్కు సందేహంకల్గి శ్యాముా! నేనిన్నిరోజులనుండి అడుగుటం మరిచాను. ప్రత్యేకించి యీరోజు నీపనియందలి నేర్పునుజూచి ఆశ్చర్యమేసింది. నీవుదైవశాత్తు నావద్ద పనికికుదిరినావు. మంచి విద్యావంతుడి గాకనిపిస్తున్నావు ఏమిచదివావు ?

శ్యాము:- యేమోసార్ ఆవిషయాలిన్ని ఎందుకు లేండి.

డాక్టరు:-ఉహూఁ చెప్పాలి అందులో నాముందు దాచుకుంటె
బాగుంటుందా.

శ్యాము:- బి. ఏ. చదివాను.

డాక్టరు:-ఆశ్చర్యంగా ఓ! బి. ఏ.

డాక్టరు కిప్పుడు తనబిడ్డ కొఱకు వరున్ని ప్రయత్నించకుండానే సమ్మతియైనవాడు దొరికాడు.

ఒక శుభముహూర్తాన రాజ్యం శ్యాములకు పెళ్ళి అయింది. కొన్నిరోజుల తర్వాత శ్యాము డాక్టరు పరీక్షలో కూర్చొని ప్యాసయాడు వేరే స్వంత హాస్పిటల్ను పెట్టాడు. తనతల్లిని రప్పించుకున్నాడు. డాక్టరు శ్యాము అంటే మద్రాసు నగరంలో మంచి పలుకు బడికలిగింది చూచారా కాలచక్ర మెలాతిరిగిందో?



# ధర్మసందేహాలు.

కులము, మతమని కొట్లాడటమేకాని సమ్మత మెప్పుడంటారు?

* * *

ప్రపంచమంతా దేవుని బిడ్డలై వివాదాలెందుకూ?

* * *

ధనికుల ధనమంతా బీదలరక్తం కాకపోతే మరేమిటి?

* * *

చేసేదోకర్మ, దూరేదోదైవాన్నా?

* * *

కోట్లకొద్ది ద్రవ్యము కర్మలకు, యాగాలకు, వేశ్యాగృహాలకు, కాకుండ బీదసంఘాల కుపయోగిస్తే దేవునికి కళ్ళమంటా?

* * *

పాతివ్రత్యము నాచరించు హక్కు స్త్రీలకేలాగో పత్నీత్వము పురుషులకువలదా?

* * *

మానభంగాలు వస్త్రాపహరణాలు చేసేవారంతాయేలా?

* * *

సినీమా హోటళ్ళంటే అనూనాదరాభిమానాలు, అవ్యాజాను రాగాలు కలిగియుండుట తప్పనిసరియా?

* * *

గర్భవిచ్ఛిత్తుచేసుకొన స్త్రీలకు ప్రభుత్వమువారు యేమైనా శాసనముచేయగలరా?

* * *

ముసలితాతలకు మూడోపెళ్ళి తప్పనిసరియా?

# అరుణాచలము.

తిరువణ్ణామలచేరువ
అరుణాచలమొండుగలదు । అయ్యది ఒకచో
హారిణో హాగ్నిజ్వాలల
గురితూటాట ప్రీతితిగలదు. గురుకులవాసా.

ఇందుస్కందా శ్రమంబును, యందమైన
గుహాలు యరుణాచలేశ్వరు, గోపురములు
శిథిలమైనను పోవని, శిల్పకళలు
నేటికిని సుపరిసిద్ధపు, నీతముగద.

ఆ శ్రమము యరుణాచల । మాశ్రయించి
ప్రకృతి సౌందర్యఛాయలు, పరివృతయగు
ఆరుయెకరాల భూమినియావరించి
వందకును జనులమించు నివాసభూమి.

గచ్చుజేసిన పరిశుద్ధ । గదులముందు.
పర్ణశాలలు తోటలు బరగుచుండు
రమణ పరివ్రాజ కులకును రమ్యమైన.
విడుదులును కట్టడములును । పెక్కుగలవు.

నూనూగు మీసలు । నునుపుబారకముందె
శైశవావస్థయు । జనకముందె
సంపూర్ణ విజ్ఞాన । సాహిత్య సంగీత
గోష్ఠియందలిచవి । గొనకముందె
కాంతతో సరసత్వం । గారంపుచేష్టల
కలలోననైనను । గనకముందె
ప్రాపంచకములోని । పనులయందలి కొంత
ప్రావీణతయుయల । వడకముందె.

తల్లిదండ్రుల విడనాడి । తపముచేయు
కౌతుకంబున విచ్చేసి । కాలునిడిన
రమణ మహర్షివాటిక । రమ్యమైన
పుణ్యభూమియు నియ్యదే । పూజ్యులారా ॥

యోగాగ్ని జ్వాలచే । యొడలు సృక్కినయట్టి
గడ్డంబు పండిన । కర్మయోగి
శాంతస్వభావ ప । కాంతవాసంబుచే
దినములుగడపిన । దివ్యబలుడు
కరుణారసంబు క । న్గవలజిమ్మెడిమేటి
బ్రహ్మచర్యముసల్పు । బ్రాహ్మణుండు
మోక్షమార్గాదర్శ । మునివరేణ్యుండును
సత్ప్రవర్తనుడు ప్ర । సన్నముఖుడు ॥

మాతృస్మార కచిహ్నంబు । మహింనిగట్టి
శివుని స్థాపింపజేసిన । చిద్విలాసు
రమణ మహాఋషి నామనో । రంగమందు
సతము నివసించుగావు త । సమ్నుతముగ ॥

—అంబటి హన్మంత రాజు.



# వేణు

* పార్శి యీశ్వరయ్య.

యేంలక్ష్మీ! యింట్లో అంతా కులాసాగావున్నారా?
అం కులాసాగానే వున్నారు మామయ్యా,

నీవు రావడము నెల్లూరి నుండా బెజవాడనుండా లక్ష్మీ?

లక్ష్మీ:-నేను ప్రస్తుతము బెజవాడ నుండే వస్తున్నాను మామయ్యా. వీరు మాట్లాడుచుండే సమయంలో వేణువచ్చి యేంలక్ష్మీ! యెప్పుడొచ్చావు మామగారు కులాసాగావున్నారా అని అడిగినాడు.

లక్ష్మీ:- కులాసాగానే వున్నారు బావయ్య అంది.

వేణు స్నేహితులువచ్చి బ్యాట్‌మెంటన్ ఆడుటానికై వేణును తీసుకెళ్ళారు. ఆటాడి వచ్చేసరికి సాయంత్రం యేడు గంటలన్నర అయింది.

లక్ష్మీ! కాస్తనీళ్ళు తీసుకురా అన్నాడు వేణు లక్ష్మి నీళ్ళు తెచ్చి యిచ్చి యింత ఆలస్యంగా వచ్చావు బావా అంది.

వేణు:-యీరోజు పోతన సినీమావుంది పోదామా లక్ష్మీ అన్నాడు.

లక్ష్మి:-అవును బావా పచ్చ పచ్చగ కలిసిపోదాంపద అంది
వాళ్ళిద్దరు సినీమా కెళ్ళి తిరిగి ఇంటికివచ్చి పడుకున్నారు

తెల్లవారి ఉదయము వేణు ముఖముకడుక్కోవటానికి కాస్త నీళ్ళు తీసుకురా లక్ష్మి అన్నాడు. నీళ్ళు ఇచ్చింది లక్ష్మి, స్నానంగూడ జేశాడు వేణు ఇడ్లి కాఫి రడీసార్ అంది. తినటానికి మేం రడీసార్ అన్నాడు. వేణు, ఫలహారముచేసి స్కూలుకు వెళ్ళాడు. స్కూల్లో మధుసూదన్ రావనే విద్యార్థివచ్చి యేరా! యీరోజు అఖిలభారత కాంగ్రెసు మహాసభ బొంబయిలో అవుతుందని అందులో ఇంగ్లీషువాళ్ళను భారత దేశమునుండి వెళ్ళండి అని తీర్మానిస్తారట యేమవుతుందో అన్నాడు. ఇంతలో ఒక కాంగ్రెసువాది స్కూలుకువచ్చి యీరోజు మీటింగు జరిగే ముందు ముఖ్యనాయకులను అరెస్టుచేశారని చెప్పాడు. యీ మాట వినగానే వేణు లేచి మనమూడొదుకు లేకెందుకు దేశము కొఱకు పాటుపడే నాయకులను జైళ్ళలోవుంచినప్పుడు మనం పూరుకోవటము మంచిదికాదు అని ఆ క్లాసు పిల్లవాళ్ళందరిని తీసికొని "జై మహాత్మాగాంధీకి జై" అంటు అన్నితరగతులకు పోయాడు. యీ గడబిడకు వీధుల్లో మందికూడి జై జై అన్నారు. యిదే సమయంలో స్కూల్ పిల్లవాండ్లు ప్రజల్లోకలిసి ఉపన్యాసాలిస్తు జయజయ ధ్వానాలుచేశారు. ఇంతలో పోలీసధికారి ప్రజలపైకి లాఠీచార్జి ఆర్డర్ ఇచ్చాడు. వేణు అరెస్టు చేయ

బద్ధాడు. రెండు సంవత్సరాలు శిక్ష విధించాడాతనికి మేజిస్ట్రేట్ యీ వార్త వేణు తండ్రికి తెలిసి విచారపడ్డా ఇంటివాళ్ళతో దేశంకోసం యేపనినైన చేయవచ్చు. మన దేశస్వాతంత్ర్యం కొఱకు యువకులు పాటుపడకపోతె ఇంకెవ్వరు. కావున నా కుమారుడు జైలుకు పోయినందులకు యేమివిచారణ లేదు. లక్ష్మీ! మీ బావ సత్యాగ్రహముచేసి జైలుకు వెళ్ళాడు బి క్లాసులో వుంచారన్నాడు. లక్ష్మి చాల విచారపడ్డది. నాలుగైదు రోజుల తరువాత తల్లిగారింటికి పోయింది. అచట ఎల్లప్పుడు విచారంగా వుంటూ రోజు రెండుపూటలన్నం ఫలహారంతినేది ఒక పూట భోజనమే అయింది. ఇలా పదిరోజులయ్యేసరికి చాలా క్షీణించి పోయింది. గాంధీ జవహర్ మున్నగు ముఖ్యనాయకుల జీవితములు చదువుట అహింసా యుధమనే రాట్నముమీద నూలుతీయుట తనకర్తవ్యంగా పెట్టుకుంది.

ఓరోజు తండ్రి లక్ష్మిని యేవమ్మా రోజు రోజుకు అలా క్షీణించి పోతున్నావేంటీ? నీమనస్సులో యేంవుందో చెప్పరాదా? అన్నాడు. యేం లేదునాన్నా నేను మంచిగ నేవున్నాను అంటుంది. కాని మనసులో సంగతిచెప్పదు. అయినప్పటికి తండ్రి బిడ్డ కోర్కెను తెలిసికొని మదరాసు వేణు తండ్రికి వుత్తరం వ్రాశాడు. దానికి వేణు తండ్రి జవాబు వ్రాస్తు మేజస్ట్రేట్‌గారు మాట్లా

డటానికి లెటర్లు వ్రాయడానికి అర్ధంచ్చారు అని తెలిపినాడు. ఈవిషయం తెలిసిన తక్షణమే లక్ష్మీ ఆమె తండ్రి, నాలుగంటల రైలుకు మద్రాసుకు వచ్చారు. లక్ష్మి జైల్లో తన బావను చూచి మనసునుస్థిమిత పరచుకొంది. తిరిగి ఇంటికివచ్చిన పిదప తన బావకు నాలుగైదుసారులు వుత్తరాలు వ్రాసింది.
ఈ విధంగా వీళ్ళిద్దరి ప్రేమలు అంతు లేకుండా పెరిగిపోతున్నాయి

ఒకటవమార్చి తేదీన వేణు విడుదలయాడు. విడుదలైన తెల్లవారి లక్ష్మికి కబురంపాడు కబురుచూచిన తక్షణం లక్ష్మి మద్రాసుకు వచ్చింది. చాలారోజులకు తిరిగి తనబావకలిసినందు లకు చాలా సంతోషపడ్డది. వీళ్ళిద్దరికి యేదైన పరిశ్రమ పెట్టా లనే ఉద్దేశ్యము జనించింది. వేణుకు డబ్బుకేం లోటులేకున్నా తండ్రి నడుగుటానికి జంకుతాడు కాని ఈ విషయము లక్ష్మితో తనతండ్రి నడుగుమని చెప్పాడు. యేం మామయ్యా! నేనొక్కటి సంగతి వింటావాఅంది. యేంటమ్మా చెప్పు అన్నాడు బావయ్య ఒకచేతి పరిశ్రమ పెడుతాడట దానికో మూడువందల రూపా యలుకావాలి! అంది. మూడు వందలుకాదు మూడువేలైన యిస్తాను అన్నాడు. వేణు తండ్రి ఇచ్చిన డబ్బుతో భారత జాతీయ చేతి పరిశ్రమశాల, యను పేరనొక దానిని స్థాపించి

నాడు. అందులో కాగితాలు సిరాన వారు మొదలైన పనులు జరుగుతూ కార్యక్రమం విజయవంతంగా సాగుచున్నది.

ఓ నాడు లక్ష్మి వేణుతో బావా ఒకమాట చెప్పనా? అంది యేంటో చెప్పుఅన్నాడు వేణు.

లక్ష్మి:-మరి మన పెళ్ళెప్పుడు?

ఇద్దరు ఒకరికొకరు ముఖాలు చూచుకొంటూ ముసి ముసి నవ్వులు నవ్వారు.

వియ్యంకులిద్దరు వేణు లక్ష్మి వివాహముహూర్తము నిశ్చయము చేసుకున్నారు. ఒక శుభముహూర్తాన వీళ్ళిద్దరికి పెళ్ళయింది. జాతీయ పరిశ్రమలు మంచి అభివృద్ధిలోకి వచ్చినవి. ఇద్దరు సుఖంగా జీవనము గడుపుచున్నారు.



# అన్నా—చెల్లెలు.



అడ్లూరి అయోధ్య రామయ్య.

"అరవిందా! అన్నీ యెరిగిననీవు, మూడు సంవత్సరాల నుంచి కాపురం చేస్తూనా హృదయాన్నెరిగిన, నీవే ఇలా శంకిస్తూ మాట్లడితే ఇకనే నేమనగలను? ఎన్నడైనా నీ రామం పరస్త్రీతో మాటైనా మాటాడినట్టు చూచావా"

"మరైతే ఈఫోటో యేమిటి? మనఇంట్లో, ఊళ్లో అంతా ఏమంటున్నారు?"

"అబ్బ! నేను నీకెలా బోధించగల్ను? నామాట నమ్ము లోకులు, బంధువులూ ఆడిపోసుకున్నంత మాత్రాన నీ నిర్మలమైన వాత్సల్యాన్ని మంటగలపుకొని యావజ్జీవితం సుఖించబోయే నాధుణ్ని వీడగలవా?"

"— — —"

"అబ్బ! ఆకంటినీటిని నే చూడలేను. నిష్కారణంగా ఈ నింద నాపైపెట్టకు. ఆమెనాసోదరి. ఆభావం ఈ ఫోటోలో నీకు కన్పిస్తులేదా? స్త్రీకి సహజమైన ఈర్ష్య, తన భర్త పరస్త్రీలోలుడైతే. కాబట్టి నీవు శంకించటానికి తావులేదనను కాని విశాల హృదయంతో యోచించు."

" క్రిందటి తడవనే మీరు పట్నం వెళ్లి నాలుగు నెలల వరకు రాని కారణంకూడా ఇదే ఐయుంటుంది. నేను మొదట కూడా అనుమానించలేదు. కాని యీ ఫోటో యేమిటి? ఒక ధర్మపత్ని తననాధుని పాదాభిషేకం చేస్తున్నట్లు ఇంకా నమ్మక పోవడమేమిటి?"

" ఐతే జరిగిన సంఘటనంతా చెప్పుతాను తరువాత నీవే నిర్ణయించు. ఇక నేనేమీ అనను" అని రామం ఇలా చెప్పసాగాడు.

" ఆరోజుల్లో ఇంటి బాధలుపడలేక, పట్నం ఉద్యోగాన్వేషింపబోయిన రోజులు. నెలపదిహేను రోజులు కాళ్లు కాయలు కాచేట్టు తిరిగినా ఉద్యోగం దొరకలేదు. కాని ఆ ఆంధ్రపత్రికా మహానుని దయవల్ల తన పత్రికలో కొన్ని కథలు మాత్రం వేసుకుని త్రుణమో పణమో ముట్టచెప్పుతుంటే. దానితోనే సవరించుకుంటుండేవాణ్ని. ఇలా ఉండగా ఓరోజు పెద్ద బజారులో ఏదో కాన్ఫరెన్సు జరుగుతూంటే వెళ్దామనుకున్నాను. ఐదుదాటింది ఇంకో పదిని ముషాల్లో సభ ఆరంభం అవుతుంది. కాబట్టి మెయిన్ రోడ్డు గుండా వేళితే ఆలస్యమౌతుందని ఆ——వాళ్ల సందలోనుంచి ( Crosscut ) గా వెళ్లిపోతున్నాను. ఏమాత్రం చెప్పటానికి అలవిగాని ఆనంద

చూచేవరకు నాకంటినీళ్లు ఆగలేదు. ఏమిట రవీందా! వాళ్ల జీవితం. అందునుండి నడుస్తున్నంత సేపూ, పెళ్లిళ్లు, అందులోని భోగం మేళాలు, జాతులు, వాళ్ల విపరీతపు చర్యలు, భార్యలు నాన విధీ ఒకవిధమైన మబ్బు ఆకాశాన్ని ఆవరించినట్లు వారు చేసే కృత్యాలు మొదలైనవి నాకళ్లలో మెరిసాయి. ఈవీధి అనే దొకటి సృష్టించిందటువంటి వారేకదా అనుకున్నాను. అలా పోతుండగా. అకస్మాత్తుగా ఒక విగ్రహం కనపడ్డది. నేనాశ్చర్యపోయాను. వెంటనే నా కాలేజీ జీవితం, నా కంటి ప్రక్కన ఉన్నవారి జీవిత స్ఫురణకొచ్చాయి. ఆమె నన్ను తన హస్తసంజ్ఞతో పిలిచింది. పోకుండా ఉండలేకపోయాను. లోపలికి వెళ్లిం తరువాత ఒ కుర్చీలో కూలబడ్డాను.

"ఏం జానకీ—నీ జీవితం!—"

"జాను. 'ప్రభాకరం ఆ నెలరోజులు నావద్ద ఉండిపోయాడా' ఆరోజునుంచి నేనతన్నే పెళ్లాడతానని కాని యీ వృత్తి వద్దని నేను మా అమ్మతో పంతం పట్టిన దానిగురించి రోజు జరిగే సంఘటనలు తెలుసుగా?"

"ఆఁ! తరువాత?"

"ఏమున్నది—కన్నతల్లి గంగపాలు కావటం జరిగింది. ఆమె చెప్పినమాటలన్నీ ఇప్పుడనుభవంలోకి వస్తున్నాయి. ఆరోజు

నుంచి ఏకాకినై పోయినాను. ఉన్న ఆస్తి ఆరునెల్లు గడిచింది. తరువాత డబ్బులేదు. కృషిపై ఆధారపడుదామనుకున్నాను. ఒక మిల్లులో పనిజేయటానికై వెళుతుండేదాన్ని. మానేజర్ ఒకరోజు బలవంతం చేయబోయాడు. ఆపని చాలించుకున్నాను. నా ప్రభాకరం కలవడు పెళ్లికాము. ఇదే రాత్రింబగళ్లు ధ్యాస చిరిత్రుణం. ఒక ఇంట్లో దాసీగా పనిచేశాను కొన్నిరోజులు, కాని దురదృష్టంవల్ల ఆతని భార్య నాకంటె కురూపి కావడం మానేజరు తో వ ననుసరించబోయాడు అక్కడికా పనికిస్వస్తి! ఇలా అడుగడుక్కు ఎన్నోదాటుకుంటూ నా ప్రభాకరం కొంకు నిరీక్షిస్తుండేదాన్ని "నన్ను ప్రథమం స్వీకరించిన వాడతను ఆతనే నాభర్త" ఈ ఆలోచనలతో రెండేళ్లు నిరీక్షించాను కాని సర్వజగత్తుకే నాపై కామముద్భవించినట్లు తెలిసికొన్నాను. అంతా నన్ను నిర్బంధించినట్లు తోచింది నామతి తిరిగింది. ఎక్కడలేని కోపమొచ్చింది వెంటనే అనగా పదిహేను రోజులనుంచి ఇక్కడ ఉంటున్నాను ఇప్పుడు బహిరంగంగా నేను వేశ్యను. డబ్బుకై శరీరమమ్ముకునే కులటనుకాని ఆరోజుల్లో నన్ను బలవంత పెట్టే వాళ్లెవరూ నావద్దకురాలేదు. ఇక్కడమాస్తునుకదా అందరు రంగ్ రంగేలాగా ఉంటారు. వచ్చినవారంతా వాళ్ల ఇంట్లకే పోతారు. మరినావద్ద ఆ బహిసౌందర్యంలేదు దానికితగ్గ ఉపకరణాలు లేవు నాపై కన్నెత్తిచూడరు ఈరోజుకు బియ్యంలేవు

ఒకానొకరోజు అన్నాఅని పిలిచిన చెల్లె నేడు 'నాథా!' అనిపిల్చి! మీకామతృప్తి నడచటానికి నిలిడిపుంది కాని నాహృదయం అప్పటి "అన్నయ్యా" జ్ఞాపకంచేస్తూంది "అంటూ నును పారిన చెక్కిళ్లపై నుంచి అశ్రుస్రవంతి వస్తుంటే నాహృదయం నీరైంది."

"ఇక ఏంచేయాల్సుండెనో చెప్పు అరవిందా! చెల్లీ" అన్నాను. ఆమె తలపై కెత్తింది. 'జాను' అన్నట్లు తలవూపి. 'నీకే భయంలేదు నీ ప్రభాకరం వచ్చేవరకు నిన్ను సాకేభరం నాది. ఇందుకు లోకమేమన్నా అన నీలత్యంలేదు అని ఏడ్చి రూపాయిాలిచ్చాను.

సంవత్సరం గడిచింది ప్రభాకరం రాలేదు. నేను నెలకు పాతిక పంపేవాణ్ని. ఒక్కనెల ఆలస్యమైంది. ఓరోజు నాకో కార్డువచ్చింది" అని చెప్పి ఏంజ్ఞాపక మొచ్చిందోకాని తన డ్రాయరలో ఓచోట గుప్తపరచిన కార్డుదీసి చూపించాడు అరవిందవిస్తుపోయింది "అరవిందా!" పద్దన్నా మొన్ననే వెళ్లినప్పుడు అన్న! నాకనీసపు కోర్కెతీర్చండి అంటే కాదనలేక ఆఫోటో తీయించుకున్నాము. నాచెల్లి ఫోటో నావద్దకూడా ఉండాలని ఉంచిందేకాని వేరుకాదు. ఇప్పుడైనా నాశంక తీరిందా?"

అని చెప్పిన రామం వాక్కులకు ఆమె ఏమనుకుందో కాని రామం వక్షస్థలంపై శిరముంచి కన్నీటితో అతని అంగీని తడిపింది. రాము సంతోషించాడు.

ఆంధ్రదేశంలో పేరెన్నిక గన్నకవి, కవికోకిల బిరుదు నందిన ప్రభాకరశాస్త్రిగారి కావ్యగాన మనివిని అరవింద యుక్తంగా వల్లెవేస్తాడు రాము ఇదివరకు కవితాపట్నమే చూడలేదు. ఆపనికూడా సరిపోయేతుందని.

ఆతను పద్యాలు చదువుతున్నంతసేపూ రాము 'అదో విధంగా చూట్టం మొదలు పెట్టాడు. అత్యుత్కృష్టమైన కవితా వాహినికి సంతసించాడుకాని ఆకవిత్వంపూర్తి అనుభవజ్ఞం ఎడబాటుఫలం పశ్చాత్తాపం అని మాత్రమూహించగల్గింది రాము ఒక్కడే.

ఆనాటికి ఇంటికి ప్రభాకరశాస్త్రి, అరవిందా, రాములూ, వెళ్ళేసరికి రాత్నం పడుకుతున్నదల్లాలేచి, "అన్నా"! అని దణ్ణంపెట్టింది మళ్లీ తక్కులకుచూచి నిర్ఘాంతపోయింది. రెండో ప్రక్కకుచూచి ఇంకా నిర్ఘాంతపోయింది. అప్పటిఆమె స్థితి వర్ణించడానికంటే ఊహిస్తేనేమేలు.



# త్యాగం

* కూరెళ్ళ వీరయ్య.

"నమస్తే! ప్రభాకర్ యెప్పుడొచ్చావోయ్!"

"నమస్తే! శశి యిప్పుడే వచ్చాను"

శశి:- నీవెప్పుడు వస్తావా అని నిరీక్షిస్తున్నాను. ఇంత ఆలస్యంగా వచ్చావేమిటి?

ప్రభాకర్:- క్షమించు శశి! చాలారోజులకు యింటికిపోయాను కనుక మావాళ్ళు రానివ్వలేదు.

శశి:-- యిప్పుడేమంత పొరపాటైందని క్షమించడం నీవు వచ్చావుగా!

ప్రభాకర్:- మనస్నేహితులంత వచ్చారా?

శశి:- అందరువచ్చారు తమరే కొదువ. ప్రభా:- ఓ అట్లాగా!

శశి:- మీవూరు సంగతులేమిటి ప్రభాకర్?

ప్రభా:- పల్లెటూళ్లో యేంసంగతులుంటాయి చెప్పటానికి?

ఈ విధంగా మాట్లాడుకుంటూ ప్రభాకర్ ఒపకు చేరుకున్నారిద్ద [illegible] బిడ్డ చిన్నతనములోనే పెళ్ళి చేశారు [illegible] దురదృష్టమో, పిల్లవాడే

అర్ధాయువు కలవాడో కాని పెళ్ళిఅయిన నెలరోజు
లకే శశి భర్త మరణించాడు తలిదండ్రులు తన
బిడ్డ పాప్తానికి దుఃఖించి చేయున దేమిలేక కాలేజిలో
చేర్పిస్తే విద్యాధికు రాలవుతుందని చేర్పించినారు.

ప్రభాకర్ శశివలే ధనవంతుడుగాకున్న కొంత భూవసతి
కలవాడు. ఆతనికి విద్యయందు అపారమైన ప్రేమ శశి, ప్రభాకర్
ఒకే తరగతివారు. ఇద్దరు చాలా అన్యోన్యంగా ఉంటారు.
ప్రభాకరంటే శశికి చాలా ప్రేమ.

అది సాయంకాలం వీళ్ళిద్దరు స్కూలునుంచి యింటికి
వస్తున్నారు.

" ప్రభాకర్ ! క్లబ్బుకి వెళ్ళుదాం వస్తావా " అంది శశి.

" క్లబ్బుకెందుకు కాలువగట్టుకు వెళ్ళుదాంపద ? " అన్నాడు
ప్రభాకర్.

" మంచిది నేను ముఖము కడుక్కొని వస్తానన్నది " శశి.
ముఖాలు కడుక్కొని టిఫిన్ జేసి కాలువగట్టుకుపోయి ఒక పచ్చిక
నేలపై కూర్చున్నారు.

ప్రభాకర్:-ఇక్కడికి రావడం సంతోషంగా లేదూ ?
శశి:-తమ వంటివారితో రావడం సంతోషంగా ఉండదు మరి,
ప్రభాకర్:-ఇందులో నాఘనత యేముంది. కాలువ వొడ్డు వచ్చే

గాలికి ఈవచ్చిక బయళ్ళో కూర్చుంటె వచ్చే సంతో
షమేకాని అన్నాడు.

శశి:-నీతో ఒకమాట చెప్తే నమ్ముతావా అంది.

ప్రభాకర్:- తప్పక అన్నాడు. శశి:- నీపైన ప్రేమవుందంటే
నమ్ముతావా?

ప్రభాకర్:-నమ్మతాగాని అదినిజమైతేగా! అన్నాడు.

శశి:- ముమ్మాటికినిజం నీవేత్యాగంజేసి నన్ను పెళ్ళిచేసుకుంటా
నంటే ధన్యురాలనవుతాను.

నేను నిన్నుచేసుకునేటంతా అదృష్టవంతున్నా! నిను పెళ్ళి చేసుకోవాలని మనసులోవుంది కాని పైకి అనలేకపోతున్నాను అన్నాడు ప్రభాకర్. ఇద్దరులేచి ఇల్లుదారి పట్టారు ఇంటిచేరుకునేవరకు రాత్రి బాగాఅయింది. వీళ్ళిద్దరి ప్రేమలు అధికమై కాలేజీలోగూడ గుసగుసలు ప్రారంభమై శశి, ప్రభాకరుల ఫోటోలు జంటగా వ్రాస్తు హేళన చేశారు. కొన్నిరోజుల తరువాత ప్రభాకర్‌కు తండ్రి 'నీవక్కడ చాలా చెడుగా ప్రవర్తిస్తున్నావట' అని ఉత్తరము వ్రాశాడు. ప్రభాకర్ ఇంటికి పోవడమేకాకుండ తండ్రి ఉత్తరమునకు జవాబుగూడ వ్రాయలేదు.

శశికి గర్భం అయిన సూచనలు కనిపించాయి. ఈ విషయం తలిదండ్రులకు తెలిసి బాగా చీవాట్లు వేశారు. ఆనాటినుండి శశి యింట్లోనేవుంది. ప్రభాకర్ కు శశి రా లేదనే విచారం అధికంగా వుండగా తండ్రి వచ్చి తన స్వగ్రామానికి తీసుకవెళ్ళాడు. తన తండ్రి నిర్ణయించిన అమ్మాయిని అవసరములేదన్నాడు ప్రభాకర్ నేను సమ్మతించిన పిల్లను మీరు ఒప్పుకోరు. ఎందుకంటే ఆమె ఏతంతువు. మనకులీనురాలేఅన్నాడు. యీ మాటకు తండ్రి ఎగిరిపడ్డాడు అలా వీలు లేదన్నాడు.

అలైతేనేను చేసుకోనన్నాడు ప్రభాకర్. అయితే నా ఆస్తికి వారసుడవా? యీయింట్లోనుంచి త్వరగా ఉద్వాసనం చెప్పవలసిందే అన్నాడు. మంచిదంటూ ప్రభాకర్ కట్టు బట్టలతోనే యింట్లోనుండి వెళ్ళి చక్కా బెజవాడ చేరుకొని శశికి చాటు మార్గంగా ఉత్తరం వ్రాశాడు.

ప్రభాకర్ పరీక్ష యయ్యాయి. బి. ఏ. లో ప్రథమంగా ఉత్తీర్ణుడయ్యాడు. శశి, ప్రభాకర్ వుత్తరం చూచుకొని కొంత డబ్బు తీసికొని యెవరికి తెలియకుండా బెజవాడ చేరుకుంది.

ప్లాట్ ఫారంపైన శశి ప్రభాకరులిద్దరు కలుసుకున్నారు. శశి ప్రభాకరుకు ఒకటిక్కట్టు తీసుకుంది. ఇద్దరు చక్కా మైసూరు

వెళ్ళారు. అక్కడికివెళ్ళాక శశి ప్రభాకరులకు ఆర్యసమాజ పద్ధతుల ప్రకారము పెళ్ళిఅయింది.

శశి తాను తెచ్చిన డబ్బుతో ఒక స్వదేశీ బట్టల కొట్టు పెట్టించింది. ఇదే సమయంలో యుద్ధంవచ్చి బట్టల ధరలు పెరిగి డబల్‌లాభం వచ్చింది. దానితో ప్రభాకర్ పెద్ద వ్యాపారం మొదలెట్టాడు. శశికి మగపిల్లవాడు జన్మించాడు. అతని నామకరణానికి తలిదండ్రులను రమ్మని కబురంపింది. ప్రభాకర్ కూడ ఈ విషయం తలిదండ్రులకు తెల్పాడు అంతా వచ్చారు యిరువ రొక్క దినము వైభవముగా జరిగింది.



# శివ ప్రబోధము

మానసరంబైన తాపానమేనుకుంద
రాజితాచల వాసంబు రహినొనర్చి
జటివిద్యైవల నాసరింతు జపయుసకట !
వాసరాధిపుచండితావార యుష్ణ
భరము నెట్టులీవేసవి గిరిజబాసి
పొందగంవోచు శ్రీనాగభూషనీవు ॥

సడలకన్నట్టిభక్తిసి నెడదనిన్ను
భజనజేసెదు సద్విజల్ పారజూడ
వేలపడతుం దెశలపాలిట్లుసేయ
పాడియేనికు పరమేశ ! భక్తపోష ॥

చలువలుంజిమ్ముచున్ గడుసౌఖ్యదంబు
నైన యాహిమాచల గృహాంతరముల
ఎలమి పార్వతి గవియక నిట్టులేల
నొంటిగా జపియించుచునుంటివోయి ॥

ఆరయునసుకూల యగుచు నీదరికిరాగ
చనువుననులోనగొన కనుమునులవృత్తి
ముగ్ధరీతినినుంటకు మూలమేమొ ?
తావలచివచ్చు తరుణి సంతాపించు ।

సీ॥ క్షితిని స్త్రీలోలుడనిగేలి సేతురనుచు
చింతగలదేమొ కైలాస శిఖరమకట
వీడగా లేవా ? గిరిరాజు వినుతిసేయ
డంచునల్గితివో ? చాలు నించుకేని
సందియంబొందబోకుము యిందుధరుడ !

గీ॥ అరయనేకాంత మందున నాలతాంగి !
గొనుట కిష్టంబు లేకున్న వినుము; కన్య
తండ్రినడుగంగ రాదొక్కొ తప్పుతోచ
మిత్రులకునైన దెలుపగా మేలుగాదె
మూగిగాశివ ! దినములు పుచ్చజను నె ॥

సీ॥ అండచేర్చిననీవు దానను మతింప
కున్నె; తన్ను దావచ్చిన కన్నెపడచు
అద్రిరాజు సమ్మతి పడియుతివనిడదె
లంపటంబయిరాదె కైలాసమునకు ॥

గీ॥ అఖిలలోకావనంబును నాశ్రితావ
శీమనోరథ సిద్ధియు నౌమహాత్మ !
కాన నీమానమునువీడి కాంతగూడి
వేగసుఖములనందుమో నాగభూష ॥

—చొల్లేటి నృసింహ శర్మ పహాపురం.

# నాడైరీలోని కొన్ని పేజీలు



* పొట్లపల్లి రామారావుగారు.

మసక మసక చీకటి. పడమటి సంధ్యా రుణచ్ఛాయలు సునాయుగా గోచరిస్తున్నాయి. వరిపడి నలుపక్కలా నిండి, ముద్దు గాకనిపిస్తుంది. ఆకాశంపైని నక్షత్రాలు వానిడలో సొగసులు చూచుకుంటున్నాయి. దూరాన! ఊళ్లోనుండి గిన్నె [illegible] కరిగ పోసిన పసిడిముద్దలాకనపడుతోంది. ఆవులు మేడలోని గంటలతో శ్రావ్యంగాచప్పుడు చేస్తున్నాయి. రాముడు ఆవుల వెనుక పాటలు పాడుతున్నాడు.

“ మాచేను పండాలె
మాగాదె నిండాలె
మాఅమ్మ పెట్టాలె
మాకడుపు నిండాలె ”

“ యిపుడు యెవరు పెడతున్నారు రాముడూ అన్నం పెట్టడం లేదా అన్నాను ? ” వరిగట్టుకు వరిగివున్న నన్ను చూచినవ్వి, సిగ్గుతో కృంగిపోయాడు.

ఏమి మాట్లాడవేం ?

'అమ్మ పెడుతుంటుంది'

చాలుతుందా ?

" జీతము యిచ్చిన నాలుగురోజులు బాగ పెడుతుందండి,

తర్వాత కాస్తే, కాస్త "

'ఏమి' ?

'తమ్ముడు, యిద్దరు చెల్లెళ్లు. వాళ్ళకేచాలదు

మానము ఏడుస్తుంటారు 'బువ్వే' అని.

" నీ జీతములోనుండే నా వీళ్ళందరికి " ?

" కాస్త జీతము "నా దెంతండి. అయ్యా కట్టెలమ్మి తెస్తాడు.

అమ్మ కూలికెళ్తుంది.

'ఏమి చాలుతుందా మరి' ?

'ఎవళ్ళు కల్లు నీళ్ళకు పోకపోతే...'

'తాగక ఊరకుంటే' ?

" బ్రతుకుతారండి ? ఆ వేళకు అటుముఖంచూపకపోతే "

'ఏమిచావరు !'

'చావకున్న బ్రతకలేరండి !'

'ఏమి నీవుకూడ తాగుతావా' ? సిగ్గుతోతల వంచు

కున్నాడు రాముడు.

'చెప్పు " ?

" నెలకు ఓసారి, రెండుసార్లు, అయ్యా తీసుకపోయి పోయి స్తాదండి "

" పెద్దోళ్ళకు " ?

" వాళ్ళకుగూడనండి "

" అమ్మోన్నూరి " ?

' అయ్యాకు తెలియకుండా తాగుతుందండి. '

' అంటే మీరంతా తాగుతారన్నమాట '

' మే మొకళ్ళమేనానండి, దేశమంతా తాగుతారు. రోజు పొట్ట అయ్యేవరకు యిన్ని రూపాయిలు కూడుతాయి. ' గవళ్ళ పెద్దన్నకు. '

' అవన్ని ఏమయితాయి ?

' సర్కారుకు పోవండి ? '

" ఏమిచేస్తుంది సర్కారు వాటిని ?

" ఏమోనండి "

అతనికేకాదు నాకు తెల్వదు. ఏమిచేస్తుందో ? సర్కారు వాటిని, భూమిపన్ను, నీటిపన్ను, ఆదాయపుపన్ను, కరోడ్గిరిపన్ను, తాగినవాడికి ఏవిధంగా లాభపడని ఆకల్లు పన్ను ఎక్కడమన్ను అవుతున్నాయి. కొంచెమా ! యివన్నికోట్లు. ఈ కోట్ల ద్రవ్యం,

ఈ అపార సంపద, ఈ మహత్తర భూభాగ్యము ఊరకనే కూడిం
దా ! ఎన్ని ప్రాణులు ఎండలో కుమిలి, వానలో నాని, చలికి బిగిసి, నిద్రలుకాచి, కడుపు అంటగట్టుకొని శ్రమిస్తే ఈ అపార సంపద కూడింది.

చెమటోడ్చి, శక్తిని వెచ్చించి, సుఖానికి దూరమై పన్నులర్పిస్తున్న ఈ ప్రాణులు, మళ్ళీతిరిగి గోలుకోవడానికి, మళ్ళీనూతన చైతన్యంతో పనిచేయడానికి, కొత్తరక్తం చూచుకొని ముందు దూకటానికి ఈ ప్రభుత్వాలు ఏలాంటి సహాయంచేస్తున్నాయి. ?

ఆర్టుకాలేజిలు, మ్యూజియములు, పార్కులు కట్టిస్తుందా ? ఎక్కడో ! మూల మూలల ఆకలిమంటలతో తలతిరుగక పొగులుతుఉన్న బీదలకు యివి ఏవిధంగా సహాయ పడుతావి ? యివ్వి ఎట్లా అందుతాయి ? దేశస్థితి అక్కడ మ్యూజియములు, ఆర్టు గ్యాలరీలు, టౌన్ హాల్‌లు, సిమెంటురోడ్లపై ఆధారపడి యుండదు. జనసామాన్యముగాదె లోని బియ్యం, ప్రమిదలోని చమురుపై ఆధారపడి ఉంటుంది. రైతు చేతిలోని బువ్వ రైతునోట్లో పెట్టడానికే, వందలు వేలూతీసికునే ఉద్యోగులకు ఆవందలు, వేలూ ఉత్పత్తిచేశి తమను నిశ్చింతగా సాకే దరిద్రుడిస్థితి తెలియదు. ప్రతియేట ఎంతమంది పసుగులు, తాగడానికి పాలులేక,

సరియైన పోషణ లేక, తల్లి ఒళ్ళో ప్రాణాలు వదులుతున్నారో, ఒంటిపై గుడ్డపేలికలు లేక ఎంతమంది రాత్రింబవళ్ళు గడపుతున్నారో! పొట్టగడవక చిన్ననాడే ఎంతమంది కూలికి, నౌకరుకు పోతున్నారో, కళ్ళలో మెఱుపు, హృదయంలో తృష్ణగల కవులు, తాత్త్వికులు, వైజ్ఞానికులు, శిల్పులు. ఎంతమంది అనామకులై పోతున్నారో! ఈ ప్రభుత్వాలు ఎన్నడైన ఆలోచించాయా!

దారిద్ర్యము, కష్టాలు, ఆ విద్య అన్నిదిక్కుల ఉన్నాయి. కాని సానుభూతి చూపేవాళ్ళు, వీలుఅయి కష్టాల తీర్చేవాళ్ళే లేరు. ఈ ఏడ్పులు, ఈ అసంతృప్తి, ఈ దారిద్ర్యం ఆకారణంగా ప్రజలు ఎందుకు భరించాలె?

యిట్లాఅని ప్రభుత్వాల నడగండి! ఏంచేస్తాయో!

" ఆకలైతుందంటే మీా అమ్మ ఏమంటుంది రామడు, అని అడగాలనుకున్నా. కాని రాముడు దూరమైపోయాడు. చల్ల, చల్లనిగాలి, కాచికాయని వెన్నెల, మామిడి పూవువాసన, రాముడిపాట నన్ను చుట్టుకున్నాయి.

" మాచేను పండాలె

మాగాదె నిండాలె

## మా అమ్మ పెట్టాగె
## మా కడుపు నిండాగె

అమ్మ, భోజనానికి పిల్చింది. చేతులు కడుగు కుంటున్నాను. వక్కలాకులు తెచ్చింది ఓ పదేళ్ళదాసి. నేను పోవడంతోనే ఆ పవిత్ర్యేక జీవిపై కన్ను మరలింది. చింపిరి జుట్టు చిరిగిన చొక్కా చాకలచప్పి ఆ కన్నుల్లో ఏదో దైన్యం గోచరించిందినాకు. అప్పుడే ఏదో అజ్ఞాతజీవితం! అనుకున్నాను. వక్కలాకులు తీసికొని "ఏ ఊరు, అన్న" "అమ్మ కొనుక్కున్నారు, ప్రాణం నిలిచిపోయింది. చేతిలో అణాకాసు పెట్టి "తల్లి తండ్రి ఉన్నారా"? అని అడిగాను

'ఉన్నరు' "ఏమి చేస్తారు? "కైకిలి" "నీచెల్లెండ్రు అక్కలు ఉన్నారా"? "అక్క. చనిపోయింది" "చెల్లెను నాతో అమ్మిండు" "నీవు యింటికిపోతావా? "పోనియ్యరు" "తోలుతే" "పోతా" "నిన్ను ఎంతకు అమ్మిండు"? 'రెండురూపాయిలు.'

పాపమా పసిదానికి రెంటి సంఖ్యకన్న ఎక్కువ తెలియదు కావచ్చు. బహుశః ఏ పదిహేనుపాయిలకైన అమ్మి ఉంటారు.

" నీపేరు ? " సరస్వతి " అనుమానం వేసిందినాకు. అసలు పేరేమిటి ? " మల్లి "

అమాయకంగా తన హృదయ మర్మాల, ముందుపెడుతూ ఉన్న ఆపిల్లనుచూస్తు అలాగే కూర్చుండిపోయాను. ఎక్కడో నాగుమెళ్ళమీద పుట్టిన్పిల్లు, తలిదండ్రులు.

అంత పసితనాన పశువులా అమ్ముడు పోయివచ్చింది. తన హృదయబాధను, ఆవేదనల గుర్తించలేని యజమానుల మధ్య జీవితం. పాపం ! యింత చిన్ననాడే కిక్కురు మనకుండా పనిచేయవలసినగతి పట్టింది. ఆకలి మంటలకు తమ హృదయ కొం లాలను అమ్ముకునే ఆ దురదృష్టపు తలిదండ్రుల ఏమనాలె !

సంతాన ప్రేమ తెల్సికూడ తమచాకిరికోసరం తలిదండ్రు లనుండి పసివాళ్ళ బాపే ఈ భోగ పరాయణుల ఏమనాలె !

మాయిళ్ళలో యీబేరాలు బాగాసాగుతున్నాయి. పాపం చాలామంది దురదృష్ట జీవులు మాయిళ్ళలోకి దిగుమతి అవుతున్నారు. అధికారం—ధనం—ప్రేమ—చచ్చిపోతుంది.

మాఘ ॥ శుద్ధ లు.



# మహాత్ముఁడు

(నవరత్నమాల)

సీ॥ సకల శాస్త్రాగమజ్ఞులు సన్న్యాసులు
అఖిల ధర్మవర్తనులు దయార్ద్రహృదయు
లయిన నీతలిదండ్రుల యందు జనన
మందితీవు సామాన్యుడవా! మహాత్మ!

కం॥ కాలికి చెప్పులు మరిమో
కాలివరకు చిన్నపంచె కట్టియుచేతన్
దాలిచి రోజుం దప్పక
గాలికిని షికారునేగెదుగాదె మహాత్మా!

సీ॥ ఒక చెంపగొట్ట వేఱొక చెంప జూపించు
పరమ శాంతమునకుం బరిమితున్నె!
[illegible]నైనగాని బాధింపగలేని నిత్య స
త్యవ్రతంబునకును హద్దుగలదె!
ఎన్నిరోజులుగాని యే కష్టమున్ లేని
నిరశన దీక్షకు నియమమున్నె!
మానవులనె గాక ప్రాణులందు దయజూచు
భళి! యహింసకు హద్దు పద్దుగలదె!

గీ॥ ధార్మికత్వము, శాంతము, దయయు, నిజము
దూరదృష్టియు, తెలివియు, ధీరతయును
భక్తి, యుక్తియు, నిజమనోశక్తి యుతుడ
వయి తెలిగితి సామాన్యుడవా! మహాత్మ!

ఉ॥ భారతమాత మున్న బహు
ప్రస్తుతి కెక్కిన పుత్రులన్మహా
గౌరవ మొప్ప బెంచియును,
గర్వము నందెను, వారలందఱున్
ధారుణి బాసిపోవ, సత
తంబు తపంబును జేసియామె, ని
న్నే, రహిం గాంచె, పన్నుపల
నేత్రి ప్రరాన మహాత్మ గాంధిజీ!

గీ॥ ముద్దుగా నొక్కటియు గ్లాసు ముక్కరాగ
నేటి యువకులు షోకుగా సూటు బూటు
వేసి కొందురు గాని యేవేళ మైన
వేయుదువె! (లండను రిటర్న్' వే, మహాత్మ!

గీ॥ ఏమి మాహాత్మ్యమోగాని యిద్ధరిత్రి
నున్న సర్వజనాళియు, చిన్నపిల్ల
లు, యువకులున్ స్త్రీలు, వృద్ధులు నయితమును
వారి వారి మనంబులో నిలిపి నావు
అహా! ద్వితీయ సర్వాంతరయామివేమొ?

మ॥ అవతారమ్ములు వచ్చె నెన్నొ, మరి మా
హాత్ముల్, ప్రియంబగ్గ, చె
ప్ప వశంబైనను గాని యెందరు మునుల్
బ్రఖ్యాత ధీరుల్, క్షమా
ధవులున్, శ్రీయుతులున్, సుధీమతులు
త్యాగేశ్వరుల్, గాయకుల్
కవులుం బోయిరి గాని వారి కలుగం
గా గల్గెనే? యెందఱున్ !

గీ॥ నీవు యెప్పుడైన నొరగంట నియమముగను *
నూలు వడకియు ఖద్దరును ధరింప
బరగ రాట్నమయె భవదుపాస్యమూర్తి
యనుచు నిప్పుడు నాకు దోచెను మహాత్మ

గీ॥ నీ ఋణంబును దీర్చుకో నేరగలరె?
భారతీయులు బహుశతాబ్దములకైన,
యెవని మాతృదేశాభిమానివగుటను " మ
హాత్మ " బిరుదంబు సార్థకంబయె మహాత్మ

—ఓంకారము రఘునాథరాజు.

# వెన్నెల వెలుగు

"ఉపన్యాస చక్రవర్తి"

* జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు.

* * *

సృష్టికర్త కాగోరు రచయిత మహాసంయమి కావలయును. ఇంద్రియ పటుత్వంగలవాడే సంయమి అగుటకు అర్హుడు.

卐 卐

చీకటి క్రమ్ముకొనుచున్నను తన యత్నములకు వెలుంగు బాసట యగునని నమ్మినవాడే ముందంజ వేయును.

卐 卐

నిన్నటి లోపములు నేడు నేలగూల్చి రేపటి విజయము నకై వానిని మెట్లులు జేసుకొనుట మహాపురుషుల లక్షణము.

卐 卐

సమ్మెట పోటులు తగిలినప్పుడే నిప్పు నెరసులు ఎగిరి గంతులు వేయును.

卐 卐

చక్కని నేల, అనుకూల వాతావరణం, రవిరశ్మి లేని పట్ల అంకురం తన యందలి మహాజీవనమును తనయందే మడియ నిచ్చును.

తీవ్రదీక్ష, నిత్యవ్రతం, బాహ్యప్రేరణము కూడినప్పుడు మనుష్యత్వ మహాత్వములు విజృంభించును.

卐 卐

రవి దెస జనువ్యక్తి వెలుగున ప్రవేశించిన యట్లే మహోన్నతోద్దేశముతో నరగు ప్రాణి వెలుగునందకమానదు. కాంతి నందినంతనే ఆత్మ ఆనంద పూరితయగును.

卐 卐

తన నాహ్వానించిన కష్టమే తన కానంద భిక్ష పెట్టునని అది యెఱుగును.

卐 卐

వ్రతమునకు, ఏకాగ్ర దృష్టికి, ధ్యానమునకు, తపసునకు అసాధ్యమైన దేదియులేదు.

卐 卐

హృదయ భేదమందె పండువంటి ప్రతిభ ప్రత్యక్షమగును.

卐 卐

జిజ్ఞాస సహితమైన వేదనయే అంతరంగమును జీల్చు హాలము.

卐 卐

ప్రతిభావంతుని రచన ముత్యములరాశి.

# చెంపదెబ్బ



* పెండ్యాల. శేషగిరిరావుగారు.

" అమ్మా! పూచ కంకులున్నాయి కాల్చిపెట్టవా ? "

" పిచ్చితల్లీ ! చకిలాలున్నాయి తినరాదూ ? ఆదరిద్రపు కంకులెందుకు " ?

" యేమమ్మా ! దరిద్రపు కంకులా ! ఔనులే, పల్లెటూళ్లో చెమటోడ్చి కష్టించేవారంతా పండించే పంటలన్నీ మనకు దరిద్రపువే. అవే పట్నవద్దికి బేరానికి వస్తే ఎంతధరకైనా పెట్టికొంటాము. అప్పుడుగాని వాటి విలువ తెలుస్తుంది. బళ్ళో మాస్టార్ యెప్పటికీ స్వదేశీ బట్టలు, స్వదేశీ చెప్పులు, స్వదేశీ వస్తువు, లేగాని వాటిని తప్పకుండా ఆదరించి మన నిత్యజీవితంలో ఉపయోగించుకోవాలంటారు. నిన్న నేను మా హిందీ పుస్తకములో बडों का कहना मानो అనే పాఠంచదివి ఇవాళ మాటీచర్ గారు చెప్పినట్లు స్వదేశీ ఫలహారం తినాలనే అభిలాషపై అపేక్షగా అడుగుచున్నా నమ్మా పెట్టావా ! లేదా " ?

" ఏమోసీతా ! నీతోచాలా కష్టమే. యేదన్న గట్టిగా గద్ది

స్తే ముఖంచిన్న బుచ్చుకుంటావ్. నీవప్పుడప్పుడు పెకితనాలు చేస్తుంటేగూడ యేమో ఆడపిల్లగదా, అని వూరుకుంటాం నీ మనస్సును నొప్పిస్తు మాత్రం మేంమూటకట్టే మహాభాగ్యమే ముంది. ఆకంరులసటు తీసుకరం! కాల్చిపెట్టా. నీవు, నీ అన్న రమేశు చిన్న తమ్ముడు మోహన్ అంతా కల్సి తినండి నే నే. మనను" అంది తల్లి. "ఉహుఁ నీవుగూండా మాతో తినాలిగా అమ్మా" అంది సీత. ఆమాటకు తల్లి నవ్వింది.

సీత ఘరానా యింట్లో పుట్టింది. వీళ్ళది పెద్ద కటుంబం పన్నెండేళ్ళకన్య. మంచి చక్కనిది. సౌందర్యానిదగ్గ తెలిపతేట లున్నాయి. అందం, తేజస్సంతా ఆమె కళ్ళల్లోనే కాన్పిస్తుంది. నల్గురుతో బుట్టువులు. తలి దండ్రులు అంతా పచ్చ పచ్చగా సంతోషంగా కంపురం చేస్తుంటారు.





రాజారావు ఘరానాయింటి యజమాని, సాంప్రదాయకుడు. కాలానుసారంగా వంసార బాధ్యతలునెత్తి పై విరుచుకపడ్డాక, స్వార్జితంగాన కష్టంచి సంతృప్తి జీవనాన్ని గడుపుచున్నారు. ఆతని కటుంబంలో వున్నవారంతా ఉత్తములు, మర్యాదస్థులు. రాజారావు కుమారుడు మురళి జాతీయ పాఠ

శాల్లో మూడవభాగం చదువుచున్నాడు. విద్యలో మంచి తెలివి తేటలు సంపాదించినాడు. ప్రతి తరగతిలో ప్రథమంగావస్తూ. బహుమానాలు గైకొంటూ, తోడి విద్యార్థులందరిలో గౌరవ స్థానం ఆక్రమించాడు అందుకే సీత అతన్ని ప్రేమించింది. అతడంటే చాలా అభిమానం.

సీత పొద్దున్నే లేచి, శుభ్రంగా ముఖం కడుక్కొని స్నానంచేసి, తెల్లచీర, జాకెట్టు ధరించి ముఖాన కుంకుమ బొట్టు పెట్టి వాలు జడ వేసుకొని, పుస్తకముల సంచి చేతబట్టుకొని పాఠశాలకు వస్తుంటే చూచేవాళ్ళ కెంతో ముద్దుఅనిపిస్తుంది. ఆమె నల్లని వెంట్రుకలనుదువ్వి జడవేస్తే ముఖమెంతో కళగా వుండి మనస్సును రంజింపజేస్తుంది. పాఠశాల్లో వున్న బాలురం దరి దృష్టి సీతపైనే కేంద్రీకరించివుంటాయి. ఐనా చిలిపి చేష్టలు జాస్తిగావుండి పెంకెవేషాలు వేసే బాలికలవలెగాక సీత అమా యకురాలు. ఆడవాళ్ళకుండే సహజమైన సిగ్గు ఈమెలో పదిహే నరాల మందంవుంది. తన మనోభావాలను సామాన్యంగా యెవ్వరితోగూడ చెప్పటకు జంకుతుంది. ముఖ్యంగా తనక్లాస్ మేటైన మురళితో తప్ప యితరులతో చనువిచ్చి మాట్లాడనే మాట్లాడదు. స్కూల్లో జెప్పే పాఠాలు తిరిగి ఇంట్లో చదువుకో మంటాడు. దీనికి మురళి సహ పాఠకులైన రాంనాథ్, ప్రకాశ్,

గణేశ్‌లు హేళన చేస్తూ వీళ్ళిద్దరిని ఒక వింత జంతువుల్లాగ చూస్తారు. వాళ్ళ ఎకసక్కెపు మాటలకు మురళి మొంతో అవమానం జెందేవాడు.

సీత ఇడిలేన్నాడు యింటిపనుల నరసికుంటూ, ఆవు గిత్తలకు పచ్చిగడ్డి తినుపిస్తూ కొంతసేపు వాటితో హాయిగా ఆడుకుంటుంది. తన తల్లి పనుల్లో గూడా సహాయం చేస్తుంది. సాయంత్రం పూట మాత్రం స్నేహితురాండ్రతో యేదైనా ఆటలాడుతుంది, వీధిలో యెప్పుడైనా మురళి కనుపిస్తే సిగ్గుతో తుర్రున యింట్లోకి పరుగెత్తి కిటికీగుండా మురళిని చూస్తూ ముసి ముసి నవ్వులు నవ్వుతుంది. సహ పాఠకులు, మురళి, సీత ప్రేమ వ్యవహారం చూచి ఈర్ష్య జెందుతూ పరిహాసంగా ప్రవర్తించినా వీళ్ళిద్దరి ప్రేమమాత్రం అతిరహస్యంగా, పవిత్రంగా గడుస్తున్నాది.

కొన్ని రోజులిలా గడచిన పిదప తన సహ పాఠకురాండ్ర ఉద్బోధనలు, క్షణిక మార్పులైన చిత్త ప్రవృత్తులు సీతను మార్చివేసి మురళి ప్రేమను మౌనంగా భావించుకుంటూ, అహో హాపడ్డది. ఐనప్పటికీ మనస్సులో మాత్రం అతని సాహచర్యం కోరుతూ ఆనంద మనుభవించుటకు ఉవ్విళ్ళూరుతుంది.

 

హాయిగా యింట్లో కూర్చుని తమకులవృత్తులను చేసు
కొనుటకు చేతగానివారంతా మన నిధులు, నిక్షేపాలు, అంటు
దేశానికై త్యాగంచేయాలని, ప్రజా సంస్థల నెలకొల్పవలయు
నని పెద్ద పెద్ద ఉపన్యాసాల వల్లె వేస్తారుకాని క్రియారంగానికి
దిగరు, దిగినా అంతా స్వార్థంతప్ప వేరేమీ లేదు. కాని నిజమైన
దేశాభిమాని ప్రజాసేవను కాంక్షించి, వాళ్ళ అభివృద్ధికై కుటీర
పరిశ్రమల ద్వారా శాంతియుత జీవనం గడుపుతూ కొంతమంది
ప్రజానీకానికి ఆర్థిక సహాయం చేస్తాడు.

卐 卐

గణేశు కొంత విజ్ఞానం సంపాదించిన పిదప తన గృహం
లో కూర్చుంటూ, పుస్తకాల పఠనం చేస్తూ తన విజ్ఞానాన్ని అభివృద్ధి
చేసుకున్నాడు దానివల్ల కొన్నికథల పుస్తకాలు వ్రాశాడు
అందులో అన్నీ తన స్వగ్రామస్తులకు సంబంధించిన అనుభ
వైక విషయాలే, ప్రజల్లోవున్న మూఢత్వాన్ని రూపుమాపి
ఉత్తేజను కల్పించు ఉజ్జ్వల దీపికలు, ప్రభుత్వాన్ని సవరిస్తూ
ఎత్తిపొడిచే వాక్కులు గ్రామపు అభివృద్ధికై కొన్ని సంస్థలు
స్థాపించినాడు. అందులో గ్రంథాలయము, పరిశ్రమశాల
స్త్రీలకు ప్రత్యేకించి రాట్నం పరిశ్రమ, కుట్టుపని నేర్పించుట
మనుజాతీయ పాఠశాలకు కార్యదర్శిగావుంటూ, ఈ పనులన్నీ
పంచుకుంటాడు. ఈతని తలిదండ్రులు పూర్వాచార పరాయ

ఖలు, సనాతన ధర్మాలనుత్రికాలములయందు జపిస్తూ పాత కబుర్లనే చెప్తుంటారు, కొత్త పోకడలెన్నియోగల్గి ప్రపంచ వైఖరియే పూర్తిగా మారినా వీరల సిద్ధాంతాలు మార్చుకోరుగదా! కాశీ, తిరుపతి యాత్రలకు, సత్యనారాయణ, కేదారివ్రతాలకు వేలరూపాయిలను ఖర్చుపెట్టే యీమహానుభావులు తనవద్ద బానిసలుగావుండి, బండచాకిరిచేస్తూ చలియనక, ఎండనక కష్టించే జీతగాళ్ళకు పండుగనాడువచ్చి ప్రాధేయ పూర్వకంగా అర్థించినా వాని ముఖాన ఒకరూపాయి పారవేయుటకు మనస్సు గుంజులాడుతుంటుంది దానకర్తలకు.




అవి క్రిస్మస్ పండుగ శెలవులు. మంచి చలికాలం. మురళి తన ఆప్త మిత్రుడైన రామారావు ఆహ్వానముపై ఆతని గ్రామానికి వెళ్ళాడు. శెలవులంతా అక్కడనే గడిపాడు. తన మిత్రునితోపాటు ఆవరిచేలగట్లన్నీ తిర్గుతూ, తెల్లవార్లు వకువ్వులవద్దనే కాపలాకాస్తూ పరుండేవారు. జ్యోత్స్న ప్రకాశంలో ముత్యాల్లాగదోచు ఆమంచు బిందువులకు, దూరంగ వెండికొండలవలె గాన్పించే ఆ పర్వతాలకు తన మనస్సులో రంగురంగుల చిత్రాలను సృష్టించుకుంటూ గేయాల్లేవాడు మురళి. నాగరరికతగల ధీమంతులు, గొప్పకవులు, కళావేత్తలు,

విద్యాంసులకు వసంత మెంత మనోరంజకంగా కన్పట్టునో, పల్లె టూళ్లోవుంటూ ఒక పూటతిని, ఒకపూట పస్తుండేవారలు యే ఆడంబర వేషాలులేక చలిపిశాచమును లెక్కచేయక, ఉడుపులు గూడా లేకుండానే తమ పంటచేల్లో హాయిగా పని చేస్తుంటారు. పట్నవాసులకంటె యీఅమాయికులగు పేద ప్రజలేగా ధన్యులు! పట్నవాసులకీ కోయిల కుహూకుహూ రాగాలు, పక్షుల చిత్ర విచిత్రపు పలుకులు, పచ్చపచ్చని పొలములు దర్శించు భాగ్య మెక్కడిది ?

అది సుమారు అర్ధరాత్రి సమయం, వెన్నెట్లో కూర్చు న్నారిద్దరు. తన మిత్రుడు రామారావు రమేశు విషయమై అడుగుచున్నాడు మురళిని. మురళి ఆతని గుణగణాలుచెప్తూ, ఇంకోవైపు తనసీత ప్రేమను మధుర స్వప్నాలు గాకంటున్నాడు. అప్పుడే పేన్సిలుతీసి సీతకు వుత్తరం వ్రాశాడు తనమిత్రుని ఒక పాలేరు నివ్వమని అడ్డి ఆవుత్తరం తన ప్రాణస్నేహితుడైన రమేశు ద్వారా సీతకు ముట్టునట్లు వ్రాశిపంపాడు. ఆ వుత్తరం చూచుకొని రమేశు తనకులోగావున్న సంశయాన్ని రూఢిపఱచుకొని మురిసి పోయాడు. కాని తనచెల్లెలు ప్రేమవిషయమై అతడంతకన్న చేసిన ఘనకార్యమేమీ లేదు. ఆవుత్తరం తీసుకెళ్ళి తన చెల్లెల కిచ్చి చదువుకోమన్నాడు. సీత ఆవుత్తరాన్ని వణకుతున్న చేత

లతో విప్పి మెల్లగా చదువుకుంది.

 

పురాణాలు, శాస్త్రాలు, శతకాలను క్షుణ్ణంగా చదువా లని చెప్పేవాళ్ళంతా శ్రీరంగనీతులు పల్కేవారేగాని యేమా త్రం పరోపకారబుద్ధి గోచరించే ఉదారత వుండదు వీళ్ళవద్ద. తన గారాబుకూతురైన సీత పెళ్ళి ఒకభాగ్యవంతునికి రెండు వేల రూపాయిలిచ్చి వైభవంగా జేయుటకు ఇష్టపడేవాడు అవే రూపాయిలు విద్యాబుద్ధులుగల్గి, గౌరవ కుటుంబీకుడైన ఒక బీదవానికి వరకట్నంగాయిచ్చి ఆతని స్థితిగతుల చక్కపఱచ వలయుననే అభిలాష, విశాలదృష్టి వీళ్ళకేకోశాన వుండదుగదా! అందుకే కాబోలు స్వార్థపరత్వం మానవునికి మహాశాపంగా పరిణమించింది.

తనతండ్రి వరాన్వేషణను కనిపెట్టి సీత పూర్తిగా మాఱి పోయింది. తన ఆశయాలన్నిటిని మార్చుకుంది. తన ప్రేమ విషయం అన్నకు తెల్పినప్పుడుగూడ ఆతడుగూడ యేమీచేయు టకు సాహసించకపోవుట, తన దైన్యానికి చింతిల్లింది. తరచి తరచి హృదయాన్ని సింహావలోకనం చేసుకుంది వృథాప్రేమలు, ప్రత్యక్ష మోహావేశాలు, క్షణికములైన స్నేహితాలు, ప్రియా

వేదనలు అంతా మాయతప్ప ఏమీలేదు. మానవజీవితరథం యెల్లప్పటికి క్రిందు మీదులు తిరుగుతు వుండుట దైవసృష్టి. శుష్క ప్రియాలతో మెట్ట వేదాంతం బోధిస్తూ ప్రేమవుందని నటించేవాళ్ళు, మనస్ఫూర్తిగా హృదయంలోనుండి సహజంగా వచ్చే ప్రేమైతేమాత్రం లాభం, క్రియకు వస్తేగా! ప్రేమికులంతా ప్రేమ ప్రేమ అంటూ కలవరిస్తూ కథలు వ్రాసుకొని మురుస్తూ, లేఖలుగూడా వ్రాయుట, విస్మయ విభ్రాంతులు, వియోగాలు తప్ప వీళ్ళు ఆప్రేమలోని పరమార్థాన్ని తెలిసికోజాలరు. తెలిసి వున్న వారెవరైనావుంటే తను ప్రేమించిన యువతినిచేపట్టుటకు త్యాగంచేస్తారా ? ఒకస్త్రీ అందానికి ముగ్ధుడై ఆమెను మనస్ఫూర్తిగా కోరినవాడైతే యే సంఘ బహిష్కారాలకేగాని, జాతి మత భేదాలకేగాని, ఆర్థిక వ్యవస్థలకేగాని లక్ష్యంచేయక అదే స్త్రీకై వ్యక్తిత్వ పోరాటం సల్పసాహసించి, త్యాగంచేయాలి. కాకపోతే నాప్రారబ్ధమని వూరుకోవాలి. కాని అనవసరంగా తను బాధపడుతూ మానసికంగా కృశించిపోవుట, ఆమెనుగూడా పిచ్చిదాన్నిచేయుటమంచిదిగాదు. చిలుకాగోరు వంకల్లాగా కల్సి మెల్సి భార్యాభర్త లిద్దరు అన్యోన్యంగా ముద్దుగా కాపురం జేస్తుంటే చూచుకొని మురిసే మహాభాగ్యానికన్న, భాగ్య భోగాలు ఆస్తివేరేకావాలా ? డబ్బు కక్కుర్తికై క్షణికపాటు సంసార సౌఖ్యాన్ని పరమఅసహ్యంగా, అపవిత్రంగా జేస్తారీపెద్దలు.

"పరమ గర్వితమై హృదయ క్షేత్రంలో దాగుడు మూతలాడిన మన ప్రేమతువ కిలామార్పు జెందిందంటే చేసే దేముంది. నిర్జీవ ప్రతిమలైన సంఘాధికారులకు మన ప్రేమ విలువ ఏం తెలుసు?"

ఈ లేఖను తిర్గి అదే పాలేరు ద్వారా మురళికి పంపింది సీత. ఆ లేఖ చూచుకొని అయోమయంగా వెఱ్ఱిగా ప్రవర్తించినాడు. ఆతనికిది ఒక 'చెంపదెబ్బ' ఐంది. పాఠశాలకు పోవుట మాని వేసాడు. సీతగూడ తలిదండ్రుల మాటపైన పాఠశాలకు పోవుట లేదు.

*　　　　　*

అది తెల తెలవారు వేళ. మురళి స్వప్నంలో సీత చక్కగా శృంగారించుకొని మెల్లగా అడుగులో అడుగు పెడ్తూ దగ్గరికివచ్చి నిల్చింది. మురళిని బాగా పరికించి ఫెడేలున చెంపదెబ్బకొట్టింది. దిగ్గున లేచాడతను. కళ్ళు తెఱచి చూచేవరకు ప్రత్యక్షంగా తన సీత నిలబడివుంది. భయంతో ఏమండీ సార్! చాలా గాభరాతో లేచారే? అంది. ఆఁ ఏం లేదు అన్నాడు మురళి. "నా వివాహముహూర్తం నిశ్చయమైంది, మాఘ శుద్ధ పంచమి. మీరు తప్పక వస్తారనుకుంటూ, నమస్తే!" అంటూ గిర్రున తిర్గి వెళ్ళిపోయింది.

కలలోనే గాకుండా నిజంగా తన సీత వచ్చి చెప్పిన వార్తకన్న మురళికి వేరే "చెంపదెబ్బ" యేం కావాలి?



# అనార్కలి.

వలపు పన్నీటి కొలకున జలకమాడి
దొరదానిమ్మగింజల నారగించి
మోవిమోవిని జేర్చుచు ముద్దులాడు
కోసమ గాయించ దంపతుల్గులుకుచుండ.

జిలుగు వెలిపట్టు జరియంచు చీరదాల్చి
కురులు సవరించి కొప్పునవిరులుదుఱిమి
ఆభరణ భూషితాంగియై యద్దమందు
తనదు సొగసును వీక్షించి తరుణియపుడు.

ప్రొద్దుగ్రుంకెడు సమయానపూలతోట
కేగియల్లన విహరించి యింపులొలుకు
విరులకొన్నింటి గ్రహియించి వేడ్కమీర
అల్లెచిత్రముగా నొక్క యలరుదండ

వలపుతలపులు మనమున గలచివైవ
ప్రాణనాయకు దివ్యరూపంబు గనుల
యెదుట సాక్షాత్కరింపనా యెమ్మెలాడి
యేమియును దోచకట్టులే యొసగుచుండ

పున్నమవెన్నెలల్ పూబోడినిద్దంపు, చెక్కిళ్ళ చిక్కులౌ చికురపంక్తి
వేణితో స్నేహంబు విసిగినేలనురాలు పరిమళయుక్తప్రసూనరాజి
భావప్రపూర్ణమా పడతియెడంద పైఅటునిటు పరువెత్తు హారసమితి
జగదేక సౌందర్య సంఫుల్ల వదనారవిందానదోచు విచారముద్ర.

తోటలో చెట్లచాటున తొంగి తొంగి
చూచియాపోక పిలిచి యాచగాక
ముందుకడుగిడి యాతడున్నదితమి త
లేసికన్నులు చేతులన్నాసినిల్చి.

ఎవ్వరో చెప్పుము న్ననయ్యాంత నాతని
హస్త యుగళంబు తనచేత నదిమికొల్చి
నాదు ప్రాణంబెయని కంఠనల్లితెలుప
ప్రణయవార్ధి నీదెనాపడుచుజంట.

పెంకి పందిలిబోలు నా పంక్తిచెట్ల
నీడ నాయమయేమే మొయాడు చతని,
కంఠమున హారమునుపైచి కౌగిలింప,
విధికి కన్నులుగుటెనా వేళయందు.

# తుంపరచినుకు.

తుంపరచినుకు అనడంతోనే, ప్రతి మనుజునికి ఆనందము, అలక్ష్యము, సహజంగా ఉద్భవిస్తాయి.

ఒకరు మాతోటలోని జలపాత ముఖమునుండి రాలు ముత్తెపు బిందువుకదా యని లోలోన హర్షిస్తారు.

బీటలు వారిన భూగర్భములోపడి, నామరూపాలు లేకుండా పోయే అల్పజీవియా! యని ఒకరు చిన్నచూపుతో తనలో తాను వీక్షించుకుంటారు.

ఏదో, మాట వరసకనుకున్నాను, గాని ఉవ్వెత్తుగా ఉప్పొంగుచున్న సముద్ర సైకతస్థలులనిలబడి ఎప్పుడైనా తుంపరచినుకును మది గైకొనినామా ?

ఎక్కడి తుంపరచినుకు ? నురుగులు గ్రక్కుచున్న సముద్రపు వీరావేశముచూచి గుండెదడ, దడ, లాడిపోతుంది. కాని హృదయపు లోతులకు దిగి సున్నితంగా ఆలోచించామా ఏమి తేలుతుంది ?

అరే ! ఈ సముద్రానికి అలవడిన అమోఘశక్తి గనిక పోచల పైకులుకుచున్న తుంపరచినుకు దేకదాయని ఒక ఆనందము, ఒక అలక్ష్యము ఒకేసారి మనలో ఉద్భవిస్తాయి. సముద్రమునూ తుంపరచినుకంటె వాస్తవమని తలలూపుతాము కాని,

తుంపరచినుకులోనె సముద్రముందంటె ఏమిటవాదిస్తారు.

అబ్బా ! వానిలో ఎంత మహత్తరశక్తి ఉందని వెర్రివారిలాగ కన్నులు మూస్తారు.

—ఏష్ణపల్లి రామారావు.

# మందలింపు.



చల్లని పిల్లగాడుపులు ఝల్లన నల్లన నూచుచుండ, నీ
యుల్లము ప్రేయసీ రుధిర పల్లవమోవిరసాస్వదంబునే,
పల్లవిగా నమర్చి పిలిపించునుగాని! మరెన్నడైన నీ
వల్లిన కైతలో కలసి యూడెనె మానిరుపేద యోకపీ?—

నీ మనమందు నిత్యము వినీలపు మేఘ సమూహపంక్తిశో!
భా మకరంద నిర్ఝరులె పారును కాని; యొకప్పుడైన, మీ
క్షేమము కోసమై రుధిర హోమముచేసెడి; కష్టజీవులన్
ప్రేమతో చూడ నెంచితివ?—ప్రేయసి హోసమె నీదులోకమా?

చిక్కని రాగమాధురిని చక్కగ పాత్రల నిండనింపి యొ
క్కటి రాతిబొమ్మలను ప్రక్కన ప్రాపుమటంచు, బల్కగా
మక్కువ యయ్యెనే??—పరులకై తన ప్రాణము లొడ్డునట్టి మా
నిక్కకు నిల్పు దృక్కుల[illegible]దిక్కును ముక్తి నిజంబుగాయకా

నాగాధికంబుతో కలిపి నాకమునంటు మహల్లుకట్టి; బం
గారపు గద్దెలందు చెలికత్తెలతో సరసాలదేలి సం
సార సుఖాబ్ధి మధ్యన విహారము సల్పెడి విత్తయుతుడా!
కోరిక లూరలేద? నను కూరిమి తమ్ముడటంచు నెంచగాన్??

నిరతము మీయుజ్జీవితము నేక మనోహర పుష్పవాటికా
సురభిళ పూల పుప్పొడులతో తులదూగుచునుండుగాక సదా
నిరత నిరంత నీరసపు జీవిత రంగములందు ధూళి ధూ
సర భరితంబులైన సుడి గాడుపులే పొడకట్టు నక్కటా !!

—పొత్తూరి నరసింహశాస్త్రి.



# నిట్టూర్పు.

* * * "ప్రతిభ"

*

శారదా! రేపటినుంచి నీవుకూడా మా ఉద్యమంలోచేరి పనిచేయవల్సివుంటుంది తెలుసా? అన్నాడురావు అప్పుడే తన కమ్యూనిస్టు నుండి యింటికివచ్చి భోజనానికి పిలవడానికి వసారాలోకి వచ్చిన భార్యతో. మొదలు భోజనానికి లేవండి మీాపనులేమో కాని మీారు మీాతిండిని, నిద్రను, ఆరోగ్యాన్ని మరచి పోతున్నారు.

అట్లాకాదు మొదలు నాకీవాగ్దానంచెయ్యి......చేస్తే కాని భోంచెయ్యను.

మీారుగూడా గాంధీగారినిరశనవ్రతం ప్రారంభిస్తారను కోలేదు. అని కొయ్యమీాదిధోతి అందివ్వబోగా,

ఈ రోజు నెక్కరుతోనే భోంచేస్తాను. తినగానే త్వరగా వెళ్ళాలి, అంటూ శారదకన్న తానే ముందు వంటయింట్లోకి వెళ్ళి వడ్డించుకునే సన్నాహం ప్రారంభించాడు. శారదకూడా ఆతనికా అవకాశం యివ్వకుండానే వడ్డించేసింది. ఇద్దరు ఆగుడ్డి లాంతరు మధ్యపెట్టుకొని ఆదరాబాదరా మెతుకులు నోట్లో వేసుకుంటున్నారు.

ఈ రోజు విశేషాలేమిటి? అంది శారద. చాలావున్నాయి కాని నేను చెప్పింది ఆలోచించుకో నీకు పదిహేను గంటల

వ్యవధియిస్తున్నాను. ఈలోగా నీవు నిశ్చయించేసుకొని మా పార్టీలోపని చేస్తాననీ, మొన్న నేను చూపించిన యెర్రకాగితం లోని నియమాలు పాటించేటట్లు కరారు వ్రాసియిస్తేనే సరి పోయింది. లేకుంటే...... ........ ....లేకుంటే ? అంది చిరు నవ్వుతో భర్త తీవ్రత ( Seriousness ) ను పోగొట్టాలనే ప్రయత్నంతో.

లేకుంటే నీదారినీది. నాదారినాది. ఇది ముమ్మాటికి నిశ్చయం. ఇహ యోచనకు సమయంలేదు. ఆరునెలలనుంచి చెబుతున్నాను. బెజవాడనుంచి మళ్ళి ఉత్తరం రాలేదుగద. చాలించు నీప్రలాపం. అంటూ జేబుతడుముకుంటూ వెంట్రుకలు వేళ్ళతో వెనుకకు త్రోసివేసి ఒక చార్మినార్ వెల్గించి బైలు దేరుతూ మరోసారి ' యోచించుకో ' అని గద్దించి వెళ్ళాడు.

*　　　　*

హాస్యానికి యెంతవాదనైనా చేస్తుంది, కాని, భర్త తీవ్ర రూపందాల్చేవరకు అతడు తప్పుతోవలో ఉన్నా, ఇల్లాలు ప్రతి ఘటించదు సామాన్యంగా. కాని, శారద తత్వం వేరు భర్త మరీ సీరియస్ ఐపోయాడంటే, తనూ ఉగ్రరాలై పోతుంది. పట్టుదల హెచ్చుతుంది. అయినా తెలివిగలది కావడంచేత అతని

పట్టుసాగకుండా, యేదో విధంగా నానా అల్లరిపెట్టి తన కోపం కనపడనీయకుండా మెత్త మెత్తగానే అతడి కోపాన్ని కోసేస్తు వచ్చింది. కాని ఈరోజు రావు ప్రవర్తన ముఖ్యంగా అతని కళ్ళలోని నిశ్చలారుణ రేఖలు ఆమెకు హడలు పుట్టించినవి.

అందులో ఆపదిహేను గంటలవ్యవధి!! పడకలు సద్దామని గదిలోకి వచ్చి గోడమీది తమ పెళ్ళి ఫోటో చూచే సరికి, ఆమె హృదయంలో తేళ్ళు పాకినయి, మెదడును ఓనూరు పాములు ఒక్కసారిగా పీక్కుతింటున్నట్టు అనిపించింది. చాప మీద దఢాలున పడిపోయింది—ఆలోచన—ఒకటే ఆలోచన గోడమీద స్టాలిన్, నోట్లో పైపుపెట్టుకొని శారదను వెక్కిరిస్తు న్నాడు, బల్లమీద "ప్రజాశక్తి" "ప్రజాయుద్ధం" పత్రికలు గాలికి రెపరెపలాడుతున్నాయి. కొడవలి, సుత్తె యెఱ్ఱగా గుడ్డి దీపంలో తళుక్కు తళుక్కుమంటున్నాయి ప్రపితామహుడు మార్క్సు, పితామహుడు లెనిన్ మొదలైనవారి తాత్విక గ్రంథాల తర్జుమాలు గూట్లో మూల్గుతున్నాయి. అనేకమైన కరపత్రాల కుప్పలు గోడకు కొలతలు వేస్తున్నాయి. బుఱ్ఱకథకు సంబంధించిన ఒక బుర్ర గూడా వ్రేలాడుతున్నది. ఇంతలో యెవరో తలుపు తట్టినశబ్దం. సుషుప్తిలోనుంచి మేల్కొని తలుపు వద్దికివెళ్లి అప్రయత్నంగా "యెవరు" అంది శారద.

"రెడ్ (ఫాంక్" అన్న శబ్దం తలుపు సందుల్లోనుంచి దూసుకు వచ్చింది.

"...... ....." ఈ ఎట్టుమితు)డెవరా! అనుకుంది.

"అంటే" అని మళ్ళీ అడిగింది.

"కామేశ్వరుడును" "పేరు" "శేఖర" "ఎందుకు"

"కామేశ్వరుడురావు S. పైప్ తీసుకురమ్మన్నాడు"

"ఎక్కడున్నారు"?

"కమ్యూనులో"

తలుపుతీసి "ఏంకావాలే" అని మళ్ళీ అడిగిందిశాంత.

" పైప్"

"అంటే"

"చుట్టపైపండీ"

"స్మోకింగ్ పైప్ ?"

"అట్లాకూడా అనొచ్చు. కాని మేముదాన్ని Stalin పైప్ అంటాము.

"ఏమైన ఏడ్చుకోండి" అని మనసులో అనుకుంటు తలుపు మూయబోగా శేఖర్ ఈ రోజు అక్కడే పడుకుంటాడని చెప్పమన్నాడు రావుగారు.

ఇంకెవరున్నారు మీ కమ్యూనులో!

పర్యటనంనుంచి యిప్పుడే ఎక్సుప్రెస్సులో వచ్చారు, కామేశ్రుడు లలిత. కామేశ్రుడు సుశీలాటాన్యా——కామేశ్రుడు సూర్యగారుకూడా వచ్చారుఅంటూ భుజం గుభాడించి చీకట్లో అదృశ్యుడైనాడు శేఖర్. రాత్రింతా రావుతో వాదించి ఎలాగైనా పరిస్థితి చెడకుండా చూసుకోవాలెఅనే ఆశలోవున్న శారద పలువున నీరైపోయింది. కొంచెము సేపు తలుపు మూయకుండా అలాగే ఆ అగాధాంధకారానికి కళ్ళు వప్పగించి పలుచుంది తలుపుకానుకుని. రెండు కుక్కలు పోట్లాడుతు గడపల్లోకి వచ్చిందాక ఆమెకు బాహ్య ప్రపంచంపై స్మృతే లేదు తలుపులు మూసేసి తన పెట్టెలో భద్రంగా దాచుకున్న ఆంధ్ర భగవద్గీతను చదువసాగింది. అంతకన్న ఆమెకు ఏ ఉపాయము ఏ ఆలోచన తట్టలేదు. ఇంచుక హృదయశాంతైన అవుతుందేమోఅని ఆమె ఆశ.... ....ఎప్పుడు పట్టిందో కునుకు. తెల్లవారకట్లగూడ రాలేదురావు.

మామూలు ప్రకారము లేచింది కాని రోజువున్న ఉత్సాహము కాని కనీసందిన చర్యగాని, ఆరోజు కనపడలేదు. ఆరోజు గడువదులాకనిపించింది. తన విచార పర్వతాలన్ని ఆరోజు సూర్యుని తూర్పుతెరల్లో నుంచి లేవనివ్వననిపించింది. ఆమెకు రావు పెట్టినగడువు ఇంకా మూడుగంటలు మాత్రమే. ఏమో అంతకన్న త్వరగానే తేల్చుకొమ్మనివస్తే? ఎందుకొచ్చిన తగాదా

ఇదంతా ! కొందరు గృహకల్లోలాల్లోపడి; కొందరు నగలు డబ్బు బట్టలకు, కొందరు వరకమునకు, కొందరు జబ్బులవల్ల, కొందరు పరకీయ ప్రణయాలవల్ల, కొందరు తాగుడు మొదలైన దురభ్యాసాల మూలంగాను, ఇట్లా అనేక కారణాలచేత దంపతుల మధ్య మనస్పర్థలు, దెబ్బలాటలుఉంటాయి. ఇవన్నీ యేవీ లేవు శారదకు రావుకు. తనతోకూడా శారదకమ్యూనిష్టు కాలేదని రావుకు కోపం. ఇదే వారిద్దరి మనస్పర్థకు బలీయమైన కారణంగా తయారయింది. మొదట్నుంచి జాతీయవాదాన్ని జీర్ణించుకొని జాతీయనాయకులను పూజిస్తు త్రికరణ శుద్ధిగా సత్యాహింసలను నమ్మిన కుటుంబములోనిది శారద రావు స్కూలు ఫైనల్ చదువుకుంటున్నప్పుడే పెద్ద ఆస్తిగలవారని సంపన్న కుటుంబీకులన్నీ శారదను ముడికట్టారు. కాపురానికి వచ్చిన సంవత్సరందాక పరీక్షపోతే పోయింది కాని భార్యాభర్తలు చిలుకాగోరంకల్లాగుడుంటూ వచ్చారు. కాని ఆ సూరయ్యగారు ఊరిలో కాలుపెట్టినప్పటినుండి కలిగిందీ మార్పు, చదువంతటితో ఆగిందే కాక, చూస్తూఉండగానే మూడు నెలల్లో అలవాట్లు, వేషము, మనస్సు, బుద్ధి గుణములన్ని మారిపోయినాయి.

సరీగ్గ వేళ పాటించి ఇల్లు బయలువెడలడం, వేళ లేకుండా

తిరిగిరావడం ఏమిటో రోజు రాత్రిళ్ళు డైరీలు వ్రాయడము
హోటళ్ళు సినీమాలు వుత్తరాలు వ్రాయడం అదోరకంగా
అలా అలా మారిపోవడం, కటువుగా నిర్దాక్షిణ్యంగా వుండడము
పట్టుదల ఎక్కువకావడం, ప్రారంభమైనాయి పోగాకంటే పారి
పోయేవాడు అప్పుడప్పుడు సిగరెట్లు త్రాగడం, తాగుతూ
తప్పులేదని వాదించటం, యజ్ఞోపవీతం తీసి పారవేయడం జరిగింది
ఇంట్లో వుండే గంగావతరణం, రవివర్మ, లక్ష్మీ సరస్వతి ఫోటోలను
వేలసులో వేసి వాటిస్థానే ఏరో పాపటాన్ని, ఇంకేమీ పటాన్నీ
లెనిన్ మార్క్స్ స్టాలిన్ పటాల్ని తగిలించడం, పెళ్ళినాటి
వుంగరాన్ని అమ్మి ప్రజా ప్రచురణాలను కొనడంజరిగింది.
మొదలు మొదలు శారదను బొట్టుపెట్టుకుంటే యెంతో
అందంగావుంటావని నుదుటిమీద ముద్దుల వర్షంకురిపించే రావు,
తర్వాత బొట్టునుచూస్తే తిట్లవర్షంకురిపించసాగాడు. ఇంట్లో
దేవతార్చన గదిలోవున్న వెండిపాత్రలను, బంగారు విగ్రహాల
నగలను దొంగిలించి పార్టీ ఫండుకిచ్చాడు——ఇవన్నీ యెన్ని
చేసినా సహించి వూరుకుంది. చివరకు, ఎన్నో నాళ్ళనుంచి నీచు
రాలని తృణీకరించిన పోగంటియిల్లు పట్టిన వెధవాడబడుచు
ముప్పైయేండ్ల లలితను, పార్టీ లోకలు పాలన్న ఉద్దేశంతో
ప్రేమించినట్లు నటించినా, వూరుకుంది. కాని ఈనాడు పదిహేను
గంటల వ్యవధియిచ్చి తనను ఎప్పటికి త్యజించేస్తాననే సరికి

శారద ఓప్పుకోలేకపోయింది.

*　　　　*　　　　*

చెప్పిన గడువు ముగియడానికి రెండు గంటల వ్యవధివున్న దనగా కామ్రేడ్ సుశీలా, టాన్యా, సిస్టరు అమోనిచ్ అనే క్రైస్తవ అమ్మాయిని, కాంతయ్యని తీసుకుని రావు వచ్చాడు తనయింటికి. కాఫీపురమాయించగా శారద తీసుకొచ్చింది. అంతా తీరిపారి కూర్చున్నారు. రావు మాటి మాటికీ అమోనిచ్ సిడిమారము వంకచూస్తున్నాడు.
" ఏమి ? ఆలోచించావా ? ఇంక రెండుగంటలు మాత్రమున్నది వ్యవధి " అన్నాడు. శారదకే సికరిసంగామాస్తూ.

ఒణుకుతూన్న కళ్ళతో జాలిగా భర్త వంకచూసింది. నాటుకమ్యూనిష్టుకాక మొదటినుండి అనగా సుమారు పది యేండ్లనుంచి అదే పార్టీకి చెందిన అమోనిచ్‌కు జాలికలిగింది కాబోలు. అయినారావుకు కనుసన్న చేస్తూ " రావు నీవు వెళ్ళి నీపనిచూసుకో.. మేమిద్దరం శారదతో ఏదోచెం మాట్లాడుతాం కాంతయ్యగారూ మీరూ వెళ్ళండి " అందిమోనిచ్. " అవును వెళ్ళండి " అని అందుకుంది సుశీల.

కాంతయ్య చిరునవ్వుతోనూ, రావు ఆశ్చర్యంతో

నూబయటికి వెళ్ళిపోయారు. పుగ్గురూ ఆడవాళ్ళు మాత్రమే కూర్చున్నారు.

అసలు సంభాషణలోకి దిగినారు సుశీలా, అయోనిచ్.

సుశీల:—"మా పార్టీ గురించి రావు అంతా చెప్పేవుంటాడు మీతో"

శారద:—"మీరూ చెప్పండి" ఆదిజేవురించిన కళ్ళతో

అయోనిచ్:—"ఎవరు చెప్పినా అదే"

సుశీల:—"అంటే మేమెందుకింత త్యాగం చేస్తున్నామో, ఇంతముందికీ చెడ్డయినా యెందుకిలా మా ఆదర్శాలకి పాటుపడు తున్నామో చెప్పి వుంటాడుగా రావు మీకు ?"

శారద:—"ఉ" సుశీల:-"ఎందుకు ?"

శారద:—ఆర్థిక సమానత్వం, రాజకీయ స్వాతంత్ర్యము, ఫాసిస్టుల విధ్వంసం.

అయోనిచ్:—"శాంతి, అభివృద్ధి కొఱకుకూడా"

శారద:—"అవును విన్నాను. పోరుపడలేక కొన్ని పుస్తకాలు కూడా చదివాను"

సుశీల:—అయితే మరి మీ రెందుకు చేరరు? మాతోపాటు మీరు గూడా వుంటే యెంత చక్కగా వుంటుందో ఊహించండి!

అయోనిచ్:— అనవసరమైన ఈ మనస్పర్థలెందుకు? రావూ మీరూ విడిచి పోవడమెందుకు? పతేదైవం అనుకునే మీ భారత

నారీమణుల సాంప్రదాయ ప్రకారంచూసినా, రావు యేడచేస్తే అదిమీరు చేయవల్సిందేగా !

శారద:--" పతిరాక్షసుల్లో కలిస్తే దైవంయెలా అవుతాడు ?

సుశీల:-- " అంటే "

శారద:-రాక్షసగుణాలు కలిగివుండడం.

సుశీల:-ఏమిగుణాలు ?

శారద:-ఇలా బలవంత పెట్టడం, వ్యక్తి స్వాతంత్ర్యానికి అడ్డు తగలడం, మొదటిది. రెండవది స్వబుద్ధిని చంపుకుని అతిమూఢము ( Fanatiesion ) గా వుండడము. అసత్య ప్రచారము హింస, దౌర్జన్యాలు, కృత్రిమవిధానాలు, మోసం......ఇవన్నీ రాక్షసగుణాలుకావూ ?

సుశీల:- " ఇవన్నీరా......"

అయోనిచ :- ఇంకా చెప్పనీయి.....ఇంకా యేమివున్నాయో మీఆక్షేపణలన్నీ చెప్పండి......తర్వాత మాకు తోచింది మేము చెప్పుకుంటాము.

శారద:- " మీకు తోచకపోతే మీవాళ్ళను అడిగి చెబుతారు కాకపోతే బొంబాయినుండి వస్తాయి జవాబులు మూడో నాటికల్లా.

అయోనిచ్:-"నీవప్పుడే ఇవన్నీ తెలుసుకున్నావే!"

సుశీల:- "మా పార్టీ నిర్మాణ చరిత్ర, మా పార్టీ నిర్మాణము గురించి తెలుసుకుంటే మీరిట్లాఅనరు. మీరింకా చదువాలె కొన్ని పుస్తకాలు యిలాంటి అభిప్రాయాలు వెలిబుచ్చేముందు.

శారద:- అక్కరలేదు బాబూ. ఆవేళను భగవద్గీతా పారాయణానికి వినియోగిస్తే యెంతోలాభం.

సుశీలా అయోనిచ్ విరగబడి నవ్వారు.

సుశీల:-అయితే మరి మీరిద్దరూ (రావూ శారద) విడిపోవడం నిశ్చయమేనా?

శారద:-ఇదేకారణమైతే విడిపోక తప్పదు.

అయోనిచ్:-చివరసారి ఆలోచించుకోండి శాంతంగా ..... మేమంతా లేమూ? నీవూ మావలె చదువుకున్నదానవు. మాకు భర్తలులేరా? మా పార్టీశిక్షణనీకు తెలియందికాదు. ఇంకగంట మాత్రము వుంది గదుల్రావు తప్పకండావస్తాడు, జరగ కూడంది జరుగుతుంది.

శారద;-మీరు ఇంకొకదినం గడువు అడగాలి రావును. ఈ రోజు సాయంత్రం మీతో ఒంటరిగానేను మాట్లాడదలుచు కున్నాను. రేపు మీయిష్టం వచ్చినట్లు చేయవచ్చును.

అయోనిచ్:-(సుశీల మొహం ఓమారుచూసి నుసినుసి నవ్వ

తో) అలాగే ..అయితే మేము త్వరగా వెళ్తాము శలవు" అని అయోనిచ్, సుశీల, టాన్యా వెళ్ళిపోయారు.

ఎలాగో రావును ఒప్పించి గడువు యిప్పించింది అయోనిచ్. రావు మాత్రం ఆరోజంతా రుసగుసల్తో భార్యను తిడుతూ విసుక్కుంటూవున్నాడు. ఏదైనా ప్రయాణంవుంటే బావుందు ననిపించింది అతనికి. ఆరోజే యేపనీ జరుగకండా వచ్చింది. సాయంత్రం నాలుగింటకే బయలుదేరి అయోనిచ్ యింటికి వెళ్ళాడు. ఆమె శారద మాట్లాడేటప్పుడు తాను పొంచివింటా నని బ్రతిమిలాడ్తే, ఉద్రేకంతో బయటికి రాకుండా వుంటానంటే రావచ్చు "అంద అయోనిచ్ " ఆ వాగ్దానం నేనివ్వలేను. ఆమె మనగౌరవానికి లోపంగా మాట్లాడితే నేను భరించలేను. "అన్నాడురావు. అలా. అయితే వీలులేదండి" అయోనిచ్ ఇహలాభంలేదనుకొని కామ్రేడ్ లలిత యింటికెళ్ళి ఆమెతో ఈవిషయమంతాచెప్పి అయోనిచ్ కూడా తెలవకండా. శారదా అయోనిచ సంభాషణ వినడానికి లలితను నియోగించాడు.

శారద సుమారు ఎనమిది గంటలరాత్రికి అయోనిచ్ వద్దికి వచ్చింది. కళ్ళు మనోనిశ్చయాన్ని సూచిస్తున్నాయి. చెక్కిళ్ళ మీదకన్నీటి చారలు కనపడుతున్నాయి స్పష్టంగా

వచ్చేరావటంతో నే యిటూ. అటూ చూచింది. ఎవరూ లేరన్న ట్లుగా చిన్నవ్వు నవ్వి ఆప్యాయంగా ప్రిన్సిపల్ కూర్చోబెట్టుకుంది అయోనిచ్.

శారద:-సిస్టర్ అయోనిక్స్! మీ అందరికంటె మీలో ఇంకా ఆ స్త్రీత్వ ఆవిశాల దృష్టి వుండడంవల్ల మీతో యింతచను వుగా వేడుకుంటున్నాను ...నాకు తెలుసు మీకు ఇలాంటి భావాలకు లొంగిపోరని అయినా మీకున్న పలుకుబడి నినే నరుగుదును.

అయోనిచ:-(నిట్టూర్చి) నీవేంచేయవంటావునన్ను! నాచేతిలో యేముంది?

శారద:-"పతి... ... పతి భిక్ష పెట్టండి" అని ఒక్కుమ్మడి వచ్చిన దుఃఖాన్ని భరించలేక అయోనిక్స్ వడిలో పడిపోయింది.

అయోనిక్స్:- (కళ్ళ నీళ్ళతో) నేనేంచేయగలను శారదా! లాభంలేదు.

శారద:-ఆ సూరయ్యకు చెప్పి బొంబాయినుండే, రావు, నిశ్చ యం మాన్పించే ప్రయత్నంచేయ గలుగుతారు.

అయోనిక్స్:-వీలులేదు శారదా. నీవునమ్ము. వాళ్ళువినరు నేను చెప్పగూడదు. నన్ను క్షమించు నేనేమిచేయలేను.

శారద:-కొండంత ఆశతోవచ్చాను. మీలో ఇంకా మిగిలివున్న దయాఛాయలక్రింద తలదాచుకుందామనుకున్నాను. కాని అవి

నిరుపయోగాలైన మోళ్ళుగా వున్నాయి. చివరికి మాలోగూడా మీడిసిప్లినే మాహృదయాన్ని గెల్చింది .....ఇంక మాటలాడలేక పోయింది. కళ్ళుమూసుకుంది. కొంచం సేపు అంధకారం తప్ప ఆమెకేమి కనపడలేదు. ఆ అంధకారంలో నుంచి మహాత్ముడు, ఆతని ఆశ్రమంలోవుండే శాంతియే శారదకనులకు మిరుమిట్లు గొలుపునట్లు కనపడినాయి. తనొక్కర్తే కాక కాయిలాంటి అనాథలందరికీ దిక్కెవరను ప్రశ్న కలిగింది ఆమెకు. ఈ ప్రశ్నకు మహాత్ముడే ప్రత్యుత్తరమివ్వగలడనుకుంది "శలవు అక్కా-శలవు" అని అయోనిచ్‌తో చెప్పి బయలుదేరింది శారద "లలిత ఏంచేశావు,? అని చివర పర్యాయం అడిగింది జాలితోను, ఆశతోను అయోనిచ్ వెళ్తాను వార్ధాకు మహాత్మునితోనే అనుగుతాను అనాథోటి అనాథల గతియేం కావాలో వారు యేమి చెబుతే అదిచేస్తాను అని బేలతనంగా అనేసింది. తిరిగిచూడకుండా నేరుగా స్టేషన్‌కు దారితీసింది. అయోనిచ్ అదిరిపడింది. కాని యేమనుకుందో ఒక నిట్టూర్పుకూడ విడిచింది.

ఈ విషయమంతా పొంచివింటూవున్న కామేశ్వరి లలిత పరుగెత్తి వెళ్ళి రావుతో చెప్పింది రావు నేరుగా స్టేషన్‌కు చేరాడు ఆమెను వారించాలనో లేక శిక్షించాలెననో. ఇతని వెంట లలిత

రాఖీవు పుస్తకము





# అహింస

ఎస్ రాజలింగంగారు.







మార్చి 1945

[illegible] ముద్రణాలయము అఫ్జల్‌గంజి హైదరాబాదు దక్కను.